# అడవిమల్లెలు

✦ ✦ ✦

యనమండ్ర నారాయణమూర్తి:
విజయనగరము.

---

యే నామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః।
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ.

భవభూతి

---

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

1926.

అస్మజ్జననికి—

విమదక్కన్ మఱియొండెఱుంగ నపుడెం
తేనిర్మలప్రేమమై
మనికిన్ గూర్తువనన్యవాంఛితముగ నా
త్మక్షేమమ్మూలంబౌ నాఁ!
దనువున్ గాతువు దైవమై, గురువవై
ధర్మవ్రతం బీశ్వరా
ననుఁ గావ్యవ్యసనంబుఁ బెట్టుదువుని
త్యంబుగ్గుతోఁ బాలతో.

తల్లి! నీప్రేమ పరమాత్మ దయకు జాడ—
ఆదయామయు ప్రతిరూపమగుదువమ్మ!
కావున ధరింపు చరణ రాజీవములకు
నానమర్పించునడవిపూ దోసిలిదిగో.

మిసిమి గలమగఱాలవలె రహిఁ
మించె నెల్లెడ మంచుబిందువు
లోకొక్కొకటి చిఱుసూర్యుఁడోయన
నొప్పెఁ జిఱుకిరణములఁ బొడుచుచు.

తియ్యనీటను జలక మాడుచు
దిశలఁ జలువల జల్లువిసరుచుఁ
గవిసి తెమ్మెరసెలఁగె నెడనెడఁ
గమ్మతావులఁ గ్రుమ్మరించుచు.

కోటికరములఁ జాచి శీతము
గ్రుచ్చెఁ గౌఁగిటఁ దావు లంటుచు
రోమరోమము వెంట దేహము
గ్రోలె నిట్టనరానిహర్షము.

వెఱపు నల జడి యుడిగి విచ్చల
విడిగ నెగురుచుఁ బాడెఁ బక్షులు
తరులు గిరులును మ్రోసె నవ్యపు
ధామయం బగుకలకలంబున.

ముద్దగన్నెరువిరులు కొప్పున
ముడిచికొనె వనలక్ష్మివహవా!
పారిజాతపుఁజప్పరంబులఁ
బానుపుగ విరచింపఁ బోలును!

బంతి పూవులబంతు లాడునొ
పసిడి చేమంతులను దొఁడుఁగునొ?
సీమకాశీరతనములతోఁ
జేసి రెవ్వరొ కుంకుమార్చన!
చెలఁగివనసౌభాగ్య మెటువిక
సించె నౌరా! కమలవనమున.
విరులునేసిన పచ్చఫగుషులు
వేల్పు లాడెమరచ్చపట్టులు.
భూతధాత్రి ప్రకృతికి దేహము,
పొలుపు దానికి నంతరంగము;
కావుననె యటఁ దవులు మది జల
కణము కణమునఁ గలియునట్టులు.

---

# పురుషకారము.

ఊర్జితమతిఁ గలిగి యొప్పరిక ముడుగు జయ
మొంది సుఖము ల్వడతువేనిఁ—
విన్ము బ్రతుకారఁ గనివిన్న పరమార్థము స
విస్తరము జేతు నొకమాటఁ.
విత్తనము సన్న మగు యత్నము శుభంబు లగు—
వ్రేయనికృపాణ మెటునజుకుఁ?
వేఁడకు మనాథవలె! వేఁడి విధి దూఱక వి
వేకమున శ్రేయముల కెడ మై.
స్వప్నమున నైన నుది సల్ప కెపుడో యెటులో
చట్టున జయుం బమరునంచున్.
నమ్ము పురుషార్థములు సొమ్మైవని కెల్లపుడు
నవ్యమయి పౌరుష మెలర్చుఁ!
నైజ మగు తేజము కళంక మగుమానువమ
నామకముగా నెచటఁగునుకుఁ:
శ్రాయము సమర్థతయు సన్నతజి నుక్కుదువు
బ్రతుకు వెడ పుచ్చితి నటంచుఁ.

కొలఁది యనిలేదు—నరశక్తి నిరవగ్రహము
కుంఠితము వాడితివయేనిఁ

బారుగున జగద్భరణకోవిదులఁ జూచుచును
బోలునె నిరర్థకుఁడ వౌటల్?

ఎవ్వరికివారె—ప్రియులైన రిపులైన భ్రమ
లేల? భవలీల యది సుమ్మా.

నమ్ము నరదైవముల నమ్ము శ్రుతులైనవిను
నమ్ముకొను మాత్మబల మొకటే.

దేహబల మొసఁగి పయి ధీబల మొసంగి నిను
దేవుఁ డెపు డాచికొని యున్నె?

సాయపడఁ డెన్నటి కసాధ్య మయి నీకొలఁది
చాలదని తొట్రుపడువఱకుఁ.

విద్దెములు నేర్పుటకు వెడలునొకో తల్లి రణ
వీరుఁడు సుతుం డనికి నడువఁ?

శబ్దములు దిద్దుటకు సాగునె గురుం డఖిల
శాస్త్రనిధి వల్కునెడ సభలో!

ఒప్పిద మెఱుంగుకర మోరిమిని గల్గు మొఁగ
మోటపడ కాత్మహితరచనఁ :

ఆరయు బలాబలము లారయు హితాహితుల
నారయు ప్రపంచవిధ మెల్లఁ.

పట్టువిడు పెఱుఁగు, నిరపాయమతితో మెలఁగు,
ప్రాపగుము ధర్మములకెల్లన్,
శత్రువుల నెన్నటికి నైఁపకుము, పెత్తనము
జరుపుకొనులోక మెదిరైనన్.
బ్రతు కనఁగఁ బందియు ముపాయము సమర్థతయుఁ
బంతము గలాఁడె చెలరేఁగున్,
బ్రతుకునకు స్వార్థజగ దర్థపరమార్థములు
ప్రాపులెదిపడిన నుడివోవున్.

---

# కష్టసుఖములు.

దుఃఖమా! బెదరింపు లేటికి—
    దొరవటే నినుఁ దలఁచి వెఱవఁగ?
జక్కఁగాఁ బరికించి చూచితిఁ
    జాలుఁ దెలిసితి నీస్వభావము!
దద్దరింతువు మంటిపులివలె
    దవ్వుదవ్వుల నుండువఱకే,
ఒద్దికరిగితొ మచ్చికైతివా
    యొడిసికైకొని స్వారిచేతునొ—
కాని యెప్పటికప్పుడే నిను
    గండ్ర వని మది భ్రమయుచుండును
మెట్టుమెట్టున కడలుచుండును
    మీఁదికెగయుచు నవ్వుకొందును.
జ్ఞానమును ధైర్యమును గలిగినఁ
    గాని నీపైఁ జొరదు మంత్రము,
నిన్ను గత్తము వెట్టినప్పుడె
    నేర్చుధైర్యము సిగురుదొడుగఁగ!
ఎఱిఁగి నిన్ను జయింపఁ గలిగితి
    నేని బానిసవై మెలంగుదు

వెఱుఁగ కోడితినా చలంబున
నిహాపరంబులఁ బొల్ల సేతువు!
నీదుకోలిమిని గరఁగినప్పుడు
నీటమీఱుదు మేలిమైతిన,

కాక నీరసలోహమైతిన,
కగ్గుదును పై మెఱుఁగుబాయుచు!
శీలమును శమముం దమంబును
జేడియలు నీతోడునీడలు:

నిన్నుఁ గెల్చినవానిఁ జేర్తువు
నెనరుఁ గూర్చెద వీశ్వరునితో.
మత్సరంబు భయంబు క్రోధము
మానస వ్యథ నీదుజోదులు:

వాని కిత్తువు నీవుగెల్చిన
వాని ధర్మవిరక్తుఁ జేయుచు!
నీదుబొమముడి కోడి తడఁబడు
నేరమియుఁ బరవశత, కన్నీడ

వానతడికోయిలలవలెఁ దా
వలము మాత్తురు కేళిసచివులు.
కవలు సఖులు సుఖంబు నీవును—
గాని యావగలాడి! చెప్పకు——

## కష్టసుఖములు.

వలపునవ్వుల వెక్కిరింతల
వన్నెలంబడి లోక మెఱుఁగదు!
ఒరుల కష్టసుఖంబు లరయన!
యుపకృతులఁ గయిసెక్క మెచ్చన!
పగలు రాతిరి యాటపాటలఁ
బందుగులఁ జెవుడొత్తియుండును.
తనకుఁ దోఁచదు పరకు సేయదు
తండ్రి నైనను హితవుసెప్పిన
నెగిరి విసవిస మంటఁ దాఁకెడు
నీఁగపోలిక వీఁగి చేడ్పడు.
ఏమికావర మేమికుత్సిత
మేమివ్రల్లద మేమిప్రజ్ఞలు!
నిల్చు టెక్కడ దానిధాటికి
నీ దురాయికిఁ గాకపోయిన?
ఎగిరి దుముకుదు పిడుగువడువున
నెచటనుండియొ దానియురమున,
నదరి వడవడ బెదరి యంతట
నరయు దొరకొనుమంచిచెడ్డలు.
పవలు రేలు సుఖంబు నీవును,
భవ శతాంగ రథాంగయుగ్మము,

క్షితివిహంగముఁ గడపు ఱెక్కలు,
జీవయాత్రకుఁ గాళికావడి.

బ్రదుకు పడవకుఁ జాపసౌఖ్యము
బరువులంగరు గొలుసు నీవన—

సుఖము మద్యము నీవు మాత్రవు
సుఖము స్వైరిణి నీవు సాధ్వివి.

విరులరాణిసుఖంబు—నీవో
వీరపత్నివి వీరమాతవు;

కాని—మఱువను— రెంటిఁ గెల్చినఁ
గాని దొరకదు దేవుసన్నిధి.

---

# అతీంద్రియపిపాస.

జయజగదీశ! దేవాధిదేవా, జగత్కారణా, పావనా, భావనాతీత, విశ్వావధీ, విశ్వచైతన్య, విశ్వాశ్రయా, నిత్యసత్యప్రభావా, స్వభూ, స్వప్రకాశా, జగన్మాననీయా, జగత్పూర్ణ, విశ్వాభిగమ్యా, శరణ్యా, భవాంభోధివేలా, విభూ, సర్వసత్తామహత్త్వావధీ, సర్వసంపన్న, సర్వోన్నతా, సర్వశక్తీ, విధీ, శ్రీశ, భూతేశ, దేవేశ, దిక్పాలలోకైకపాలా, గణేశా, నరేశా, గురూ, పాలకా, శాస్త్ర, దుర్జ్ఞేయ, దుర్జేయ, దుర్ధర్ష,—నిన్నెట్లు కీర్తింతు? నేరూపునంగొల్తు? నేపేరిటంబిల్తు? నిన్ జేరలేకున్న వేమాటలేయూహ లేయుక్తులున్—నిన్ను బ్రేమించి, కామించి, కాంక్షించి, పూఁదోఁటలోఁ దేఁటివాటంబుగా, నష్టరత్వాధ్వమై రోయువానింబలెన్, దల్లికిం దూరమై త్రోవగోల్పోయి కొట్లాడు లేదూడచందాన నెందెందొ యెట్టెట్లొ సేవించి, భావించి, నిన్గానలే కాత్మ వేసార నింకేమిది క్కేయుపాయంబు? నీప్రాపు నేకూరు నెట్లీశ్వరా! యెట్లువర్తింతు? నేపుణ్యము ల్సేయుదున్?—నీవు విశ్వాత్మవై విశ్వరూపుండవై నీవులేనట్టిభూతంబు గానట్టి రూపంబు లేదంచు నీచేత నాచేతన వ్రాతమం

దన్నిటఁ నీదురూపంబు మూర్తించి, నీదివ్యకల్యాణ శీలంబుఁ గల్పించి, ధ్యానించి, పుష్పాంజలుల్, ధూపదీపంబులుఁ, జందనచ్ఛత్రమాల్యాంబరంబుల్ సమర్పించి మెప్పించి నీదివ్యతేజంబు వర్ణించుచుఁ, నృత్యగీతంబులఁ బారవశ్యంబు మైఁగొల్తునా? లేక నీప్రాభవం బింద్రియాతీతము న్నీదుతత్వంబనిర్వాచ్యముఁ నీదుధామంబు దుష్ప్రాపమం చెంచి, నీభవ్య కైంకర్యపారంగులై ముక్తులై చేరువం జేరియున్నట్టి దేవర్షిలోకంబునర్చించి, తప్తిగా దానపూజాగ్నిహోత్రంబులఁ జేసి, శుష్కోపవాసంబులుఁ జాగరంబుల్ పురాణేతిహాస శ్రుతుల్ నోములుఁ సల్పి తీర్థంబులం దాడి, భూదేవసంతర్పణంబుల్ గ్రహారాధనంబుల్ గిరిక్షేత్రయాత్రల్ వృషోత్సర్జనంబుల్ తరూద్వాహముల్ లక్షదీపంబులుఁ భూతశాంతుల్ జయంతుల్ బలుల్ మున్నుగాఁ గల్గు కర్జంబులఁ జేతునా? లేక జీవప్రపంచంబు నీచెయ్వి కా, నీకుఁ బ్రేమాస్పదం బాటఁ దత్సేవ నీసేవయేయంచుఁ దక్షిమముం గోరి విద్యాలయంబుల్ వనంబుల్ తటాకంబులుఁ సత్రముల్ వైద్యశాలల్ ప్రతిష్ఠింతునా—నీతిమార్గంబునంబోయి నీశాసనం బాదలం జేర్చి సత్యంబు, శౌచంబు, శాంతంబుఁ, బాటించి కారుణ్యశీలుండనై భూతబంధుండనై స్వార్థభంగంబునైనఁ మదిఁ గొల్చ

కుత్సాహిం సైశీలినై లోకసౌఖ్యంబు వాటింతునా—
లేక కించిజ్జ్ఞుఁడన్ మోహాబద్ధుండ దేహాభిమానాభిభూ
తుండ నామాట లెన్ననియు నీమహత్త్వంబు నీపావ
నారంభసంరంభముల్ భద్రశీలంబు వర్ణింపలే నంచు,
నీదివ్యకారుణ్య పాత్రంబుగా లేవటంచున్ మహర్షీరితం
బుల్ మహామంత్రముల్ బీజముల్ పల్లవంబుల్ పుర
శ్చర్యగావించు చంతర్బహిశ్శుద్ధిగా యంత్రముల్ వేర
ముల్వ్యాట్టిన్యాసంబులన్ ముద్రలంబట్టి యష్టాంగయోగ
ప్రయుక్తుండనై నీశుభాకారమాత్మైక్యసంధానముంజేసి
ధ్యానింతునా— లేకవిశ్వంబు విభ్రాంతిగా,జన్మనాశంబు
లత్యుక్తిగా, గర్మజన్యంబులౌ సంపదల్ సాధనంబుల్
వికల్పంబుగా,నింద్రియార్థంబు లౌద్వంద్వముల్ కామ
మోహప్రకోపంబు లౌటన్ జరారోగమృత్యూద్భవం
బైనసంసారబీజంబుగా, నమ్మినన్నుండి దేహంబుభేదించి
పైఁబెట్టి నేనాత్మగా నేనె బ్రహ్మంబుగా నెంచి చిత్తంబు
బుద్ధీంద్రియాహంకృతున్ నెమ్మనంబున్ నిరోధించి
నీయందె లీనంబు గావించి సంకల్పసన్న్యాసి నేకాకినై
జీవముక్తుండనై జ్ఞానినై యోగినై నిత్యతృప్తుండనై
సంసృతిక్లేశ లేశంబుఁ బోనాడి నీదివ్యసాక్షాత్కృతిన్
దేహమాత్రావరోధంబుగా వేచి కాలంబుఁ బుత్తెంతునా
—అట్లుగాకున్నచో నగ్నియేరీతిగాఁ గాల్చు నేరీతిగా

సూర్యుఁడెండించు, నేరీతి మేఘంబు వర్షించు నారీతి జన్మాంతరారబ్ధకర్మౌఘ మయ్యె ఫలంబీనఁగా దుర్నివారంబు లజ్ఞాతసంప్రాప్తముల్ ఖేదమోదంబు లాసన్నమైనప్పు డావంతయుఁ మానుషారంభముఁ నమ్మకా సారవాతాతపావృత్తికిఁ లోనువైనట్టి వృక్షంబునుం బోలి యేకాలమం దేమివాటిల్లు నద్దాని నానోముగా నీప్రసాదంబుగా నెంచి సైరింతునా—లేక ప్రత్యక్షమే సత్యమంచుఁ బరోక్షంబు బాటింప కేమాట కాయర్థమే చేష్టకావ్యాప్తి, యశ్వద్ధబీజంబు తాళంబుగా మొల్వనల్లిన్నఁడుఁ మానుషం బొక్కఁడేగాని సర్వార్థసంప్రాప్తికిఁ గారణం బొండులేదంచు, యాదృచ్ఛికంబైన దేహాదిసామర్థ్య మేదిక్కుఁగానమ్మి ధర్మార్థకామంబులే యావదర్థంబులం చెంచి సేవించి లోకజ్ఞుడన్ లోకతంత్రస్వతంత్రుండనై దుర్బలారాతులం గెల్చి దురేయులంగొల్చి కార్యార్థసంసిద్ధికేగాని ధర్మం బతివ్యాప్తిగాకుండ గార్యార్థభంగంబు వాటించు దుర్నీతిమాత్రంబు వర్జించి ధన్యుండనై జీవయాత్రఁ సభద్రంబుగా, బుష్పి తారామకేళీవిహారంబుగా సల్పనా? చాలు! సౌభాగ్యమీ యైహికైశ్వర్యసంప్రాప్తి కింతేల? యేదైనఁగానిమ్ము నీయాజ్ఞలే కెట్లువర్తించు? జిక్కానిలేనట్టి యల్పప్లవం బాభవం బింతయుఁ? భగ్న

యంత్రంబు లా వ్యోమయానంబులా ప్రాణులయ్యా!! నిరాలంబమై వాతనిర్ఘాతమైనట్టి ఛిన్నాభ్రమా యీయా జాండంబు? ప్రారబ్ధమా సంపదాపన్నిమిత్తంబు? వహ్వారె! ప్రారబ్ధకల్లోలినిఁ ద్రోసి నేఁదాఁట లేకున్న దాటింపనీకైన స్వాతంత్ర్య మావంతయుఁ లేక తేలింపఁగా ముంపఁగా దాని పాల్సేఁతకుఁ నీమహోదారకారుణ్యభావంబు, సర్వోన్నతత్వంబు నీధర్మపాలత్వముఁ నీనిరాఘాటసా మర్థ్య మెట్లోర్చె నోకో! జగత్పూర్ణమై దివ్యమై భవ్యమై పావనంబైన నీజ్యోతిలోనే మయూఖంబకే! విశ్వకూలంకషంబైన నీవార్ధిలో నేఁదరంగంబకే! విశ్వచైతన్యమూలంబనం బొల్చు నీవహ్నియందేను కీలంబకే! అట్టినన్నిజడంబై దయాహీనమై యుగ్రమర్యాద మైనట్టి కర్మంబు కేలఁ సదా కేళికాకందుకంబట్లు పీడింపఁగా నెట్లువాటిల్లె! నేనమ్మ! నేనొల్ల! దైవంబుగా నట్టిదైవంబు! సూర్యప్రభఁ మావుఖద్యోతమే నెన్నఁడుఁ గాన! నంభోధికిం జేటలడ్డంబ! నిర్హేతుకంబై స్వతస్సిద్ధమై సర్వజీవైకశశ్వన్మహాభాగధేయంబుగా నొప్పు కారుణ్యభావంబుమై జాలిమై నీవు నాదోషముల్ సైఁచి రక్షింతు వంటేనిఁ గర్మంబు వారించునే? నీకటాక్షంబె నేకూరెఁబో, కర్మముఁ గిర్మముఁ గోట దాటింపనా తండ్రి! నీకైనఁ బ్రేమంబు లేదందునా! ఉండిలోభింతు

వంచింతునా ! కాదు— ప్రేమంబవే నీవు. నీదక్షి-
దాక్షిణ్యమున్ శాంతియున్ గూడనా? నీవు లేవంటయే
నీకుఁ బ్రేమంబు లేదంట, లోభింతువం టేమి నీదివ్య తేజం
బసంపూర్ణ మం టేమి? దుర్ణీతుఁడౌ పుత్త్రు దండింపఁ జే
యాడ కెంతే నుపాయజ్ఞుఁడౌ నొజ్జ రావించి పూజించి
యో యయ్య! నీవాఁడు సుమ్మీ! దయాళుండవై యట్టి
దండింప కాగాత్యమున్ మాన్పి విద్యానిధిం జేసి నా
కంపుమా యంచు నందిచ్చు తల్లింబలెన్ నిర్మలున్ జేయ
నన్ గర్మ కందిచ్చి తానట్టి హింసించిన ష్టాదరాయత్త
చిత్తంబుతో నిత్యకల్యాణశీలంబుతో నిర్వికల్పానుకంపా
లసద్దృష్టితోఁ బ్రోచుచున్ వచ్చివిద్యోదయుం జైనవె
న్వెంటనే క్రమ్మఱన్ నన్నుఁ గైకొంచుఁ గైంకర్యముం
గొందుగాఁబోలు—నేమైనఁ గానిమ్ము నిన్నే మది న్నమ్మి
యున్నాఁడ ముమ్మాటికిన్ మిత్త్రుగాఁ దండ్రిగాఁ గర్త
వున్ భర్తవు న్నీవె! నిర్ణేతవున్ భ్రాతవున్ గూడ నీవే!
భవాంభోనిధిం గల్గునుల్లోలకల్లోలజాలంబులో నీవె
నాకాశ్రయంబంచు భావించితిన్ దండ్రి! సంసారకాం
తార మధ్యంబునన్ మార్గసందర్శకజ్యోతిగా నమ్మియు
న్నాఁడ నీవాఁడ నాకేల యీవంచనల్! నిన్ను సేవించి
యున్ దైన్యమా? నిన్నుగాకున్న నావారలన్వేఁడు
దున్? జాల మేలా ననుం బ్రోవ నాపాలిదైవంబ? నిన్

శుద్ధనిర్వ్యాజభక్తిఁ సదా గొల్వనా? నీకు దాసాను
దాసుండఁగానా? భవత్సృష్టిపై సోదర న్యాయము
జూపనా? పుణ్యముల్సల్పనా? ధర్మమందాదరంబూననా?
పాడి గా దీచలం బల్పకీటంబుపైఁ బావకాస్త్రంబు—
నా దోషముల్ సైఁచి రక్షింపు మీపాటి, నాసేవగైకొ
న్మా, నన్నమ్ము, మానాఁడు ప్రహ్లాదుఁగైకొన్న భవ్యాభ
యాంకంబుతోడన్, మృకండాత్మజున్ జేర్చి యోదార్చు
మందస్మితాస్యంబుతో, సవ్యసాచిన్ జయశ్రీఘనుం జే
యుసుస్నిగ్ధభావంబుతోడన్, భవద్దివ్యరూపంబుఁ బ్రత్య
క్షము జేయు; నీదివ్యతత్త్వంబుఁ జిత్తంపుదాహంబు
తీరంగసువ్యక్తము జేయుమా—బ్రహ్మవై యాయురా
రోగ్య భాగ్యంబులం గూర్పు, విష్ణుండవై శ్రేయము
ల్పెంచు, రుద్రుండవై శత్రుసంహారము జేయు, మిం
ద్రుండవై యేలుకో, విఘ్ననాథుండవై ధర్మదీక్షావరో
ధంబులం ద్రోయు, మన్నింట సద్భాగ్యరూపుండవై
మైహికాముష్మికార్థంబులన్ జేర్చి జన్మంబు సార్థంబు
గావించి యాపైని సాయుజ్యముక్తిన్ బ్రసాదించి
మన్నింపు దేవా! ప్రసీద, ప్రసీద, ప్రభో! దీనబంధో!
నమస్తే నమస్తే నమః.

# తిట్టకు.

తిట్టకు తిట్టకు మెవ్వరిఁ గానీ!
తిట్టుట నోటికిఁ జేటునకే—
లాభమ, పౌరుషమా, పరమార్థమ,
లక్షణమా నగువారలకున్ ?

తిట్టకు తిట్టకు శత్రువు నైనను
తిట్టినవానిని దేవుఁడు మెచ్చఁడు
తిట్టుకు నూఱువ్రతంబులు పోవును
తెలియవె పూర్వపురాణకథల్ ?

తలఁపకు నీగుణములె మహిమంబుగఁ
దక్కిన వాకస్మికములు గాఁ :
దలఁపకు నీయవగుణమె పరాకుగఁ!
దక్కిన వన్నియు దండ్యముగా—

పనివడి నీనడవడిఁ బరికింపుము
పరులను శోధించిన తమితో,
పరుల ప్రమాదము లోర్చుము నీపొర
పాటులకోర్చు నుదారతతో.

నేరము సేయుట మానవధర్మము,
నేరముఁ గాయుట దైవికముగ్,
నేరము దిద్దుట యార్యులపద్ధతి,
నేరముఁ బన్నుట రాక్షసకృత్యము.

తిట్టినతిట్టులు తగిలిన నన్నియు
దేవునితోఁ బని యేమి యిఁకన్
నీవలచినయటు సృష్టికి భంగము
నెఱపునె యీశ్వరుఁడో వెడఁగా?
నీవలచినయటు సృష్టి నడచుటకు
నీవలె నెందఱు లోకములో?
నీవలచినయటు నడచిన నెవ్వఁడొ
నీవె కలంగుదు వార్తుఁడవై.
దేవునిసృష్టికి దేవుఁడె యేలిక—
దేవుఁడు సర్వసముండు సుమా!
దేవునిశాసన మమితదయార్ద్రము,
దేవునిఁ జేరవు పరుసపుఁగూఁతలు.
లోకహితంబును బూని ఘటించును
లోకులకుఁ సుఖదుఃఖములఁ
న్యాయముచొప్పున నెవ్వరి కెయ్యది
యర్హము సర్వవిదుండగుటఁ.
ఎవ్వరి కెప్పుడు కలిమియొ లేమియొ
యెవ్వరి కెవ్వరు మిత్రులొశత్రులొ
ప్రభువులొ భృత్యులొ లోకము నేలెడి
పన్నికచొప్పున సమకురుచుఁ.
తిట్టకు శత్రులఁ దిట్టకు దుష్టులఁ
దిట్టుట—చుల్కనిబుద్ధి సుమా!
శత్రుల గెలువుము! దుష్టుల మార్పుము!
జాలిఁ దలంపుము లోకముపై—

# కొండ - ఉడుత

ఒక్కనాఁడు కొండతో నుడుత యొకటి వాదు లాడె :
కొండ పల్కె "దుండగీఁడ ! గోరులో సగము లేవు
ఇంత విఱ్ఱవీఁగు టేల ? హెచ్చుతగ్గు లెంచవేల ?"
దాని కుడుత బదులు చెప్పె—"తగవు లేని మాట మాను
ఎవరి గొప్ప వారిదే—యెవరుగొప్ప ? యెవరు కొద్ది ?
నీవు గొప్పవాఁడవైన నేనుమాత్ర మేల కాను ?
గుణము లన్ని కూడి కాదె గొప్పవానిఁ జేయఁగలవు?
ఒడ్డుపొడుగు లేనిమాత్ర మున్నవారు కొద్దివారె ?
నిన్నుఁ బోలు పెద్దవాఁడ నేనుగాను—నన్నుఁబోలు
చిన్నవాఁడ వీవుగావు ! చెంగుచెంగు దాఁట లేవు !
హెచ్చుతగ్గు లన్ని యిట్టు లీశ్వరుండు సమము సేయు :
నిన్నుఁబోలె కఱ్ఱ కంప నేను మోయలేను—నిజము,
న్నుఁబోలె కాయకసరు నమలఁ గలవె నీవు చెపుమ !"

---

# ఆర్తశరణాగతి.

శ్రీసత్యవిజ్ఞానతేజోమయా, చిన్మయా, విశ్వవిశ్వాశ్రయా, సర్వభూతాంతరాత్మా, మహాత్మా, జగద్భంగసందోహనిర్భిద్ర మాయాఖ్యశక్త్యంబుధీ, భూరిసంసారతాపప్రణాశాచ్ఛచారిత్ర, సర్వజ్ఞ, సర్వేశ్వరా, వాఙ్మనోతీతసామర్థ్యసంపూర్ణ, నిర్ద్వంద్వ, నిత్యా, నిరాలంబ, యోగేశ్వరా, విశ్వరూపా, దయాసాంద్ర,నీ భక్తిమై నిచ్చలుం గొల్తునో యద్వితీయా —భవద్భక్తిసర్వైహికాముష్మికార్థప్రదంబంచు నార్యుల్ నుతింపంగనే నెయ్యెడన్ విందుఁగానన్ జలద్భంగసంఘాత ఘాతంబులన్ దాల్మిమైఁ గొంచకేపారుశైలంబులీలన్ విపజ్జాలముల్ భీషణాకారముల్ నుట్టి ముట్టన్ భవత్పాదపంకేరుహధ్యానముం జేయు చేకాగ్రతన్ ద్వత్కృపాపాంగసంపాత విశ్వాసశక్తిన్ ధరన్నిల్చి యున్నాఁడ వేఱొక్కటన్ గాదు తండ్రీ !! నన్నుం బ్రోవు,నాయాశ మన్నింపు, నీదీనరక్షాపరత్వంబుఁ బాటింపు భద్రాత్మకా,సాధుమిత్రా,పవిత్రా, మహాఘాటవీవీతిహోత్రుండవౌ నీకు మద్దుష్కృతంబుల్ గణింపంగఁజన్నే? గురువ్యాధిచే శీర్ణమై వ్రాలనున్నట్టికాయంబు నీరోగమున్ మున్నుగాఁ జేసి పైనిన్ బలిష్ఠంబుగాఁ జేయు వైద్యుల్ వలెన్ మున్ను నిర్దోషిఁగా, నట్టె త్వద్దివ్యకారుణ్య

పాత్రంబుగాఁ జేసి నన్నుద్ధరింపంగ నీవే సమర్థుండ-వెల్లెన నిత్యాపదల్ వాపి శ్రేయంబు వాటింపు-మద్వైరిలోకంబు ధర్మప్రవృత్తంబుగా మార్పు - లోకంబునన్యోన్యసౌభ్రాత్ర విభ్రాజిగా, వీతదౌర్జన్యలేశంబుగాఁ, జేసి లోకస్థితిఁ గూర్పు మోసర్వలోకైకసామ్రాజ్యలక్ష్మీప్రియంభావుకా, నన్నుఁ బాపీశాపనాయత్తతన్ నైజసౌజన్యమున్ విద్యయున్ మాన మున్ బాసి నీచాతినీచాశ్రయం బూననీ కయ్యయో! నిత్య మత్యంతమోదప్రదం బైన నీయాజ్ఞ మన్నించుచున్ జన్మ సార్థంబుగా స్వార్థలోకార్థకోటిన్ సభద్రంబుగాఁ గాచి రంజిల్లునైశ్వర్యమీడేర్పు—నింకెంతకాలంబు నీప్రాపులేకిట్ల హోరాత్రముల్ ధైర్యముం బాసితత్త్వాజనం బై హిక్కై కాళియంబూని కావింతు నయ్యో! దయంజూడు మి పైన నాయార్తరావంబు నాలింపు, పాలింపు, సర్వార్థముల్ గూర్చి నాథా! నమస్తే నమస్తే నమః.



# జయవిజయులు.

మ-రా-శ్రీ గురజాడ అప్పారావు గారికి—

తెలుఁగు కానిమ్ము! గ్రామ్యము పలుకుఁ జెలికిఁ
గర్ణభూష గానిమ్ము! వ్యాకరణఘాటి
శీర్ణ మై స్వైరవిహృతి రంజిల్ల నిమ్ము!
మనల కద్దానఁ బోరాట మాన్య మగునె?

హితులు బహుదేహ మిక నేకహృదయ మగుట
భేద మొకవేళఁ గలిగినఁ బ్రేమ చెడునె?
ప్రాణమును బాయుదము గదా పరమభక్తి
స్నేహదానసాఫల్యదక్షిణకుఁ గాను!



విన్న మును వర్ధిలిరి జయవిజయు లనెడి
బాలు రిర్వురు విద్యావిశాలమతులు,
సునిశితవ్రతు, లభిమానఘనులు, నర్మ
మిత్రు లన్యోన్యచిత్తాబ్జమిత్రు లగుచు.

ఒండొరునికి బహిఃప్రాణ ముత్తమాంగ
మలరు సంసారబంధ మాశలనిదాన
ముఱుసదాచారహేతు వొండొరునిహితము
తనకు మాలినధర్మ మై మనిరి వారు.

తీవలటు తావు లల్లుక పూవుదావు
లటులఁ బాయ రాహారవిహారకేళి

కలన గాఢానురాగంపుఁగల్మి నొకఁడొ
కండు లేకున్నఁ దలఫులకొండె మగుచు !

ఇటులఁ బెద్దకాల మేఁగిన నాభూమి
నేలురాజు స్వార్థహితుఁడు, చపలుఁ
డమితదుర్విదగ్ధుఁ డై కృధాయత్తుఁ డై
జయునిమీఁదఁ దగనిశౌర్య మూని,

తనపటుప్రతాపదంభోళి జళిపించి
వదలె ఘోరవృత్తి వానినెత్తి
నవనవాబ్జ మగ్ని నవయించుజడు నట్లు
పోలుబోలములకు బుద్ధిమాలి.

ఉదయరవి గ్రుంకునట్లు నృపోగ్రశిష్టి
మిత్తివాతను బడఁగ నిమిత్తమైన,
శూరు డై యిట్లు వల్కెఁ గుమారు డపుడు
బలువగనుగూరుచూపఱు భళియనంగ :

"రాజహితము ప్రజకుఁ గర్తవ్య మెందుఁ
గాన హితమేని గొన్ము నాప్రాణ మిదిగొ
ప్రాణశత మున్నఁ నా యెడఁ బాయువాఁడ
నీకు శతమానసంతుష్టి నెఱపుకొఱకు.

కాని దయగల్గువాఁడ వై లేని రెండు
ప్రొద్దు లాయువుఁబొడిగింపు పురికిఁ బోయి

తల్లిదండ్రుల నీడఁ గాని తడయ కిటకు
వత్తు విధిగాన—నీయాన—వసుమతీశ."

అనుచుఁ దనదండధాటి బి ట్టవిసినట్టు
లైన, వల దన మోమోడి యట్టె చూచి
నరవరుం డనె "నెవ్వరి నమ్మి విడుతు?
నీవు రాకున్న వధ్యుఁ డై నిల్చు నెవఁడు?"

"నావచశ్శుద్ధి!"—యింతలో నభమునుండి
వెలువడినయిష్టదేవతవలెను నిల్చి
"నిదిగో నా దేహమును బ్రతి యిత్తు" నంచుఁ
బార్థివునిమ్రోల నబ్బాలుప్రాణసఖుఁడు.

వాని కనియె మహీశుఁ "డో వయసుకాఁడ!
కాన వౌకార! విరిదండ గాఁగ కంఠ
పాశ, ముగ్రకృపాణంబు పంచశరుని
శరమొ? మృత్యువు సుందరీస్పర్శనంబె?

కనుము దినములు యుగములు గావు సుమ్ము
యీరవినిఁ జూడ వీవు ముమ్మారు వెడఁగ—
నీదుపరమాప్తుఁ డెల్లి గా నేరకున్న
నెవరుఁ గావరు యమపురి కేఁగునిన్ను."

"ఇప్పుడేఁ గద నధిప నీ వీయకొన్న
నన్ను వధియించి విడువుము నావయస్యు

హీనకృతి ధ్యైన యమపురి కేఁగ వెలిచుఁ
జెలుత లపరాధు లై బడిసే రనట్లు.

అనఘుఁ డతిలోకచారిత్రుఁ డతనికొఱకుఁ
బ్రాణ మిప్పించుపాశంబు పారిజాత
హార, మసిధార స్వర్గరాజ్యాభిషేక,
మమృతకాంతాపరిష్వంగ మరయ మృతియు."

* * *
* * *

జయుఁడు పురి కేగెతడ వాయె నయము దొరఁగి
మిత్రు నగ్గము గావించె మిత్త్రిబారి
కనుచుఁ గలకల మొదవె రాజాంగణమున
నాఁటి ప్రొద్దున మూఁగుజనంబులందు.

రాజుపగ పల్లవించె, గర్వంబు మించె,
సమయ మే తేర విజయుని సభకుఁ బిల్చి
మరణశిక్ష విధించి యుత్తరనిమేష
మతనిఁ గొంపోవఁ దలవర్ల కానతిచ్చె.

అతఁ డటుఁ లేగునంతలో నధిపుఘోర
నియతిమూ ర్తిభవించెనా నిలకభటులు
దగ్రకరవాలపాణు లై దండధరుని
ఖలిక సమకట్టు చున్నెడ బద్ధదృష్టి,

తోఁచె నవ్యక్తఘోషంబు దూరమందు
నట్టి కలకల మై వచ్చె నందు నడుమ
నిలునిలు మటంచుఁ జేతులు వెలికిఁ జాచి
శరజవంబునఁ బరుగిడి జయుఁడు నిల్చె.

వానివెన్వెంట వచ్చి భూజాని, సఖుల
కెఱఁగి "వహ్వారె, యీసఖ్య మీఋజుత్వ
మమరగేయంబు! సుఖ ముండుఁ డయ్య యింక
జ్ఞానినై వీతగర్వ నై యేను మనుదు."

---

# నీవు-నేను.

నిండుపూనిక బ్రహ్మదేవుఁడు
నీకునాకునుగూర్చి వ్రాయఁగ,
నొండొరులకై పూర్వభవముల
నుగ్రతపములఁ జేసి పుట్టఁగ,
మనుజులెవ్వరి తరమొ, ప్రేయసి,
మనలవిడివిడిబండ్లఁబూన్చుట !
మార్చుటేల? జగత్త్రయంబున
మనకుసరి యెవరీడు జోడును?
(ఈశ్వరేచ్ఛ) మఱెన్ని జన్మము
లెత్తనీ, నినెగాని వలవను.—
మొదట నావడు గప్పుమనన్గని
మురిసినీజనకుండువలచెను :
వెడఁదనొసలు, మెఱుంగుజెక్కులు,
వీనులంటెడు వాలుఁగన్నులు,
పసిఁడితొడవులమిసిమిమెసవిన
పసుపుగందపుఁబూఁత మైసిరి—
అక్కటా! యిపుడేదియా జిగి?
యంతరించె భవంపురాపిడి.

వలచి యువ్విళులూరి మెచ్చుచు
వారువీరన కాశ్రయించెను,
ఘోరశపథమునట్టెనేఁగై
కొననిచో నరుఁడుండె వరుఁ డని.
మఱచితో నీయవ్వ, మంటల
మారి, కొడుకున కిడినబిరుదులు ;
"వలదువలద"నెఁ "దూఁగఁ జాలవు
వాండ్లు బల్లిదు లాకతాయులు—
పెళ్లితోసరి నీభవిష్యము
పిల్ల నేలననాఁడుచూతము !"
శ్రోత్రియుండు తపస్విమత్పిత
సుంత సంసరణాస్థఁ బెట్టఁడు :
నాలుగేండ్లవుఁ గాదనం డొక
నాఁడుబల్విడి నిల్వరింపఁగ,
"వైశ్యవృత్తి—పొసంగుటెట్ల"ని
పల్కి మరల జపానఁ గూర్కెను.
వైశ్యవృత్తి! సెబాసు! జరుగునొ
వైదికము తన భంగి నెల్లెడ?
వృత్తిలోఁ బనియేమియూనుర
వృత్తములఁదిగి చెఱపకుండిన.
వృత్తినడుగకునరునినాశము
వృత్తినెరపిన విధమునడుగుము:

వృత్తులన్నియు లోకతంత్రపు
వీణపాటకుమీటుతంత్రులు.
కడకు వట్టి గతానుగతికమె
గాదొ మనకులధర్మమెల్లను,
అంధుడంధులనడపుకైవడి
నయ్యొ నార్యమతంబునేఁటికి!
అగ్గిపేరిట బుగ్గిఁగాగుదు
మకట! శిష్టాచారమనుకొని,
నది కృశించిన నేల నెప్పటి
నావనీక్ష్చక పయనమగుదుము!
చాలునిదియొకొ ఋషులసంతతి!
శాస్త్రవిధి కలవడెనెయీఁగతి?
యేనుఁగుల దిగవిడుచుపిడికిట
నీఱుపేఁ బదిలంబుసేతుము
మనికి కడ్డము తగులువఱకును
మార్పఁబోడఁగమ నార్యఘోరణి.—
పిల్లనల్లనిదనిరి బంధులు,
పెదవివిఱిచిరి యిరుగుపొరుగును,
అమ్మమేనత్తకంపుఁబల్లపి
కంత మెఱుఁగదు రేలుపగలును.
చోరవకును సరియకును నడ్డముఁ
జూడ—యింతకు విధి బలీయము;

సుముఖమ్మై విధిపొసఁగకుండిన
సురియదొరకదు చొరవతోఁపదు—
చెల్లననఁ దగువరములడిగిరి
సిద్ధమంటిరి మీరు వెంటనె:
వెయ్యి నూటపదాఱు కట్నము,
వెండి, బంగరు, పట్టుదోవఁతు,
లత్తకైదు మొహర్రు చీరెలు,
ఆఁడు బిడ్డల లాంఛనమ్ములు—
ఇస్సిరో నరమాంసవిక్రయ
మెంతదురితపుమూలమైతిసి!
ఇస్సిరో బలి దప్పిదోఁపిడి
యెట్టులర్పణ మౌను నాకిది?
“రాజు ప్రజకనుధర్మచరుఁడను
రక్షుఁడై శాసింపకీగతి!
కానిచోశ్రుతి ధర్మమాతను
గడనక త్రెగఁబుత్తుమోయిటు ?
పరమలౌకిక తంత్రచతురుఁడు,
పరమనోగత తత్త్వకోవిదుఁ
డెంతొతీర్పరి మాపురోహితుఁ
డితవుసెప్పుచు నినుక మేపును.
సమయమిది యది యని తలంపఁడు
సరకుగొనఁ డెవరెన్ని సెప్పినఁ

జదువు నీశుభలక్షణంబులు—
జ్యోతిషము సాముద్రికంబును
చదివి చదివి యొకప్పు డల్లన
జనకుదారిని నిన్నుఁబెట్టఁగఁ
గాంధి కనికరమొందె నలరెను
కనులసిరి కొలువున్నదనియెను
నాఁడు మొదలు త్రిణేత్రుఁడడ్డము
నడువనీ—యినుమంతయొసలఁడు.
నేఁడుగా మూఁడేండ్లు గ్రహాగతి
నిల్పినిలిచిన వింధ్యమొరగెను?
ఇదియెపో లోకంపువసువడి,
యిషుమలొందక శుభములమరవు:
మంచు వేసవికుడుకకమరెనె
మంటిచెలకకు మింటివర్షము?
కాని చెలకయుజలము నెఱుఁగవు
కష్టమొరులది ఫలము మనలది,
నిండుబాల్యపువేడ్కలప్పుడు
నీకునా కీకథలసందడి.
తెలియకయె వలవకయె శుభముల
దిద్దిపోషిచు ననుగ్రహంబున
నీలకూఁతలమరగియున్నవు
డీశ్వరుఁడు మన బ్రతుకులతికెను.

తొలుతనిన్గనుఁగొంట మన వన
దుర్గజాతరనాఁటిప్రొద్దున;
ఏఁటికొకతఁటిమాఁకుఁజుట్టము
లిల్లుసత్రముసేయుదినమది-
తుణముదినముగ గడచె, డెంచము
సందడించెను సిరికి నీకై,
సిరులమించిన సిరివి పంకువు
చెల్వు మించినచెల్వ వైతివి !
కంటిఁగననటు, వింటివిననటు,
కలిసి తటుకునమరలెఁజూడ్కులు,
వెదకి వేమరు దరిసి మురిసితి,
వింతముద్దులు గుడిచినడిచితి.
కతమెఱుంగక మిన్నుముట్టితి
గడనసేయనియటు నటించితి,
ప్రిమదమును నీగమనికలఁగని
బ్రతుకు తేనెగ జుఱ్ఱిలిడితిని.
అంకురించెనొనాకుమగతన
మట్టి నీమెయితొల్కరింపగ,
అణఁగిమణఁగినవలపువల్లరి
యలరెనొకొ నీచైత్రపదవికి !
పెండ్లియైతిమి—గడచెనేఁడులు
పేరిమప్రాయపు బోదఁగొనలిడె

మున్ను స్వాతిశయాన( బుట్టిన
మోహమూర్తి త్యాగమయ్యెను.
నీటఁ జెదరిన చంద్రబింబపు
నీడ చిఱుతతనంపుఁగూరిమి
ప్రాయ మడరినఁ జెదర కిరవగు,
బ్రతుకు చవియగు కొలఁదిఁ దిరపడు.
బ్రతుకుఁ గావ్యపురసమ్మైతివి,
భవకుసుమసౌరభమ వైతివి,
బ్రతుకుటోడకుధ్రువమ్మైతివి,
ప్రతిభకెల్లఁ బ్రమాణమైతివి....
నీవులేనిసుఖానఁ జొక్కను,
నీవు మెచ్చనివింతవిన్నన,
నీవెగలిగిన బరవసంపడి
నేర్తు మచ్చిక సేయుటిదుమల.
ప్రసవదామ మటంచు బ్రమసిన
భవము భారముతోఁచినప్పుడు,
ప్రాణబంధువు లనుచునమ్మిన
పరులు పరహిత మొల్లనప్పుడు,
పరమశరణముగా భజించిన
పరుఁడు కన్నడచేసినప్పుడు,
జయముద్విగుణము పెంచి
బన్నము నగమునంచుక సంతరింపవా?

ఎందుఁజొచ్చినఁ బొందునినుమది
యేలు పల్లముఁ జేరుకై వడి,
నీకతన మలుసూపునిద్దిన
నెనరు ద్రాసటు ముక్తి నునిచిన!
నీకనుల నాహృదయ మేర్పడు,
నీకునాకును హృదయ మొకటియొ!
నాదుఛిద్రములఁ జొత్తు నావలె
నా ప్రభావముఁ బెద్ద సేతువు.
ఫలముఁ జవియును మనలపొందిక
పలుకునర్థము, పసిడి మెఱుగును;
మనల బల్విడిఁ బాపఁ దలఁచిన
మరణమును మొనవిఱిగి చేడ్పడు.
ప్రకృతి పురుషుని వలచి యెప్పుడు
భయముఁ గడుపు ఫలంబుగాఁ గనె
నదియె వలపున కాది, యప్పుడె
యాత్మ కాత్మ నివృత్తి గలుగుట.

---

# బ్రతుకు కథ.

---

## 1

కథఁ జెప్పు మందువు! కథ కేమి— బ్రతుకు
కథఁ జెప్పెదను వేయుకథలతోఁ బాటి.
వినుము నాజనకుండు ఘనుఁ డాహితాగ్ని
వేదవేదాంగకోవిదుఁ, డాత్మవేది,
యధ్యాపనంబున నన్నదానమున
విసుగఁడు, తపమందు వే పనుల్మఱచు,
నియమంబు విడువఁడు నృపుఁ డడ్డమైనఁ,
బాలఁ బడితి నన్నఁ బ్రాణంబు వెట్టు,
మాయూళ్ల నాతనిమాట మర్యాద—
పేరిభట్టనఁబులు ల్నీ రాన వెఱచు.
ఆతనిపనిగాని దా వాడ లేదు
సవనతంత్రిమెగాని సరిహాద్దిగాని.
శాస్త్రచర్చల కేమి సహాపఙ్క్తి కేమి
ధర్మశంకల కేమి తగవుల కేమి
యాచన కేమి కార్యాలోచనలకు
సిద్ధౌషధములకు సిద్ధాంతములకు
సంప్రదాయములకు సందర్భములకు

మాతండ్రి నాశ్రయింపనివారు లేరు.

మేనజికపుటాలు మితిమీఱుచెల్మిఁ
బసినాఁటనుండియుఁ బతియుఁ దాఁ బాయ
కర్థనారీశ్వరు లమ్మయు నతఁడు,
నేఁడుమాసములు లే విద్దఱిలోన,
నుగ్గులోఁ బెట్టిన దొంతరొకపొత్తు,
బహుజన్మములది కావలయు దాంపత్య
మాయదృష్టంబున కద్దియే సాటి.

పురిటిమజ్జన మాడి పొత్తిళ్లలోనఁ
బుత్తడిబొమ్మనాఁ బొలుపారుదాని
నెత్తుక ముద్దాడి యత్త "నేఁబాను
తమ్ముఁడా! దీని నేత్రములందు సిరులు
దొలకాడుః నీదుకూఁతురు భద్రశీల,
యిదిపుట్టినెడ మెట్టినెడ లేమి లేదు,
ధనధాన్యములు గల్గు ధర్మంబు తెలుఁగ
దీబొజ్జ దోసతో టీచేయు సత్ర
మిది వంశవర్ధిని యిది వంశతిలక—
మమ్మపోలిక—దీని నమ్మా యటంచుఁ
గోదువ తీఱఁగఁ బిల్చికొని పెంచుకొందు
పేరిబాబున కిచ్చి పెండ్లిఁ గావింతు
వాకోడ లయి పుట్టె నా కప్పగింపు"
మని నొడలోనుండి తనకంటెఁ దీసి.

తోడుగునంతట మ్రోసె గుడిలోనిఘంట!
అయిదవనెలపాపయైయప్పు డత్తింటఁ
గావురమును సేయఁ గదలె మాయమ్మ.
అదిమొదల లోకబోదె నగుతీఁగె లట్లు
పెరిఁగి యుల్లము లల్లిబిల్లిగాఁ బెనఁగి.
కలలోనికథయట్లు గడచెఁ గాలంబు,
పైరగాలికి సాగుపడవ చందాన
నాటలపందున నరిగె బాల్యంబు.
కాని యొక్కవిధానఁ గడచు నాకాల?
మలరులపానుపా యక్కటా! బ్రతుకు?
అన్నపదీక్షితు లన్నట్లుగాను
పలువురు నడలాడుబాట సంసార
మొక్కసూటిగఁ బోవు టొప్ప దెవ్వరికి;—
తొలఁగుచు తగ్గుచుఁ ద్రొక్కుళ్లఁ బడుచు
వదరుచు బెదరుచు వల్లనైనంత
మెలఁకువఁ దప్పక మెలఁగుటే కీర్తి.
విఖ్యాతఘనపాఠి వేదార్థవాది
మాతాత పండిత మాత్రుండు గాఁడు:
సానఁబట్టినకత్తి శాస్త్రార్థయుక్తి
శ్రౌతంబునడపు టాచయనాంత మెఱుఁగు.
కాని లోకజ్ఞానకలితుండు గాఁడు:
బ్రతికిననిండుడెబ్బదియేండ్లలోనఁ

జూడఁడు పొగబండి చూడఁ డంబోధి;
కావ్యలోకంబు స్వగ్రామలోకంబు
గాని లోకంబు లోకము గా దతనికి:
అమరేంద్రు నెఱుఁగుఁ బంచమజార్జి వినఁడు
బ్రహ్మాస్త్ర మెఱుఁగును బారు లెఱుంగ
డెఱుఁగును శరభంబు నేనుంగు నెఱుఁగఁ
డలకాపురి నెఱుంగుఁ గలకతా వినఁడు!
ఒకసారి దొరసాని నొకదానిఁ జూచి
వింతగాఁ గన్నులు విప్పి పాటించి
యాఁడుదో మగవాఁడొ యని శంకఁ జేసె!
అదియటు లుండని మ్మాతని కేల
గడప కావల దాఁటి కాలు సాగింప?
భూములు నట్టింటికామధేనువులు—
పలుదినుసులఁ గోరి పండించు ననుము.
శ్రావణి కొక్కటి సంక్రాంతి కొకటి
చెరి దివాణంపువార్షిక మింటి కేగు.
శిష్యులు మంత్రులు, సేవకుల్, సఖులు,
చిత్తముఁ గనిపెట్టి సేమంబుఁ గూర్తు—
రరఁగుపై నుండి వాక్యార్థంబు సేయు
చున్నాడ లక్ష్యమా యున్నమానవులు ?
కాని లోపంబు నొక్కటి సెప్ప కేమి ?
కష్టపుసానలఁ గట్టిగా రాయ

కెప్పుడు విడదయ్యె నెద నున్నమసటు.
తా ముందు తా మధ్య తాను దర్వాత
స్వీయచక్రము దాఁటి శ్రేయం బెఱుంగఁ;
డింతంత గాదు జియేచ్ఛ మత్సరము
తెలిసితి ననువానిఁ దెరలింపఁ బూనుఁ,
దనకు రానట్టివిద్యల వెక్కిరించు,
సభలోనఁ బ్రతివాది సైఁపఁ డెన్నఁటికి
నింటను మన్నింపఁ డిల్లాలిమాట.
ఒకనాఁటిప్రొద్దున నూసుపో కలిగి
పిలిచి కయ్యము వెట్టి పెండ్లాముతో డ
సాధించి వాదించి చలపట్టి కనలి
వంచన సేయంగ నెంచి యుంకించి
కొడుకున కిరుగింటిపఁచు నొక్కర్తు
ముడివెట్ట సమకట్టె మోటుతోనాన
నెవ రెన్ని సెప్పినఁ జెవిఁ బెట్టఁ డయ్యె.
నాన్నకుఁ బదునొకండవ పాఱియ మప్పుడు.
కాని మాగడుసఁట ! కడు వాఁడివాఁడు !
వెఱవఁడు విసుఁగఁడు వినవట్టె తోఁచుఁ,
దండ్రి మూర్ఖతయును తల్లిదైన్యంబుఁ
దెలిపియుఁ దెలుపని చెలియూరటమ్ము
మనసునఁ బెట్టి నెమ్మది నాఁటిరేయిఁ
సింహాచలం బేగి శ్రీనాథునెదుట

సాహసలక్ష్మి హెచ్చరికలు సేయఁ
దండ్రి వెట్టినముహూర్తమునకే చక్క
నగ్నిసాక్షిగఁ బెండ్లియాడె నెచ్చెలిని.
చిటమటపడి తాత చిమిడి సిగ్గారి
యింటను రచ్చను నొంటి నైయె తుదకుఁ
గోపము బిగఁబట్టి కొడుకుపై విసువఁ
దఱివేచి వేచి డెందము సందడింపఁ,
గడుజాలిఁ గొని బీతువడి పల్వరించి,
మ్రొక్కి దైవములకు ముడుపులు గట్టి,
నాఁటి శర్వదిరెయొకండనాఁడు తుదకుఁ
గాశిలోఁ గేదారఘట్టంబునందు
నవదంపతులు విశ్వనాథునేఁబడిని
సుఖమని విని సుంత శోకంబు వాసె.
ఆపట్టె పట్టుగా నతిలోకదీక్ష
గురుకులమున నేర్చి కులవిద్యలన్ని
యిఱువదిమూఁడవయేఁట నిల్పెరె
మాతండ్రి చెల్లి నప్పును నన్నుఁ గొంచు.
అదియె పో పౌరుష మది సూవె ప్రజ్ఞ;
చేతఁగా కెన్నఁడుఁ జెడి పోఁడు జనుఁడు
చేత నైనది పూని చేయక గాని!
అద్రులఁ జీల్చి సముద్రము ల్దాఁటి
నభమందు విహరించి నదుల మళ్లించి

నట్టిమానవశక్తి కద్దమా యెందు?
తారల దూరంబు సారంబుఁ గట్టి,
భువన మంతటి నొక్క భవనంబుఁ జేసెఁ,
బ్రకృతిని లోఁగొని ప్రతిసృష్టిఁ జేసె,
నాత్మను గని పొందె నద్వైతసిద్ధి—
మానుష తేజంబ మానంబుగాదె?
అరయక బుద్ధి సేయక సాహసింప
కాయాసపడఁ జాల కల వాల్లఁ బాయ
కౌచిత్య మెంచి శిష్టాచార మెంచి
బాలుఁ డుంగర మిచ్చి పండ్లు కొన్నట్టు
కడిపెడు గంజి కై కక్కుర్తిపడుచు
లోనిదైవాంశంబుఁ బోనాడి యిట్లు
పరవశతను బేద వడుదుముగాని.

తనయు నెదుర్కొని తలిదండ్రు లిర్వు
రక్కునఁ జేర్చి ముద్దాడి, దీవించి,
సంతోషమునఁ బొంగి, సంతర్పణములు
వ్రతములు పూజల వ్వారిగాఁ జేసి,
మఱలించి కాంచిరి మఱియొక్కమాఱు
చిఱుతప్రాయముఁ జేవ చిగిరించినట్లు.
తాత కింతంతమోదము గాదు సుతుని
వాక్చమత్కృతిఁ జూచి వైదుషిఁ జూచి;
లావుఁ బరీక్షించి తా వీఁగి యొసఁగె

బాలభారతి యని ప్రౌఢనామంబు.
కోడలి మాత్రము కొడుకు నెత్తికొని
దండము వెట్టించి తనపేరఁ బిలుచు
వఱకును గన్నెత్తి మఱి చూడఁ డయ్యొ!
ఇంతంత లోర్చె నాయిల్లాలు పాప
మేనాఁటికి ఫలించె నిన్నికష్టములు!
కాని భూదేవత! కలనైన విసుఁగ
దెఱుఁగదు మత్సరం బెఱుఁగ దెబ్బెఱిక
మాయోర్మి యోర్మి కా దాయొప్పిదంబు
మార్దవమును నేర్పుమర్యాద నెనరు
మఱి యెందుఁ గంటిమి మానినులందు?
కొడుకులు కోడండ్రు కూఁతు లల్లుండ్రు
వారిసంతతియును వారివారలును
బంధువు లతిథులు బలసి యిల్నిండ
స్వాయముగ నుదయంబు సాయంతనంబు
నవరించికొని వచ్చు నడిసద్దులేక.
ఊర నందఱ కమ్మ సూరుసోదెమ్మ
పేరుపేరునఁ బిల్చుఁ బిల్లమాఱుగను,
వావితోఁ గాని యెవ్వారితోఁ బల్కు,
దెఱుఁగు నెవ్వారిబంధు లేడేడ నుండు,
రరమర తెఱుఁగ దాయాసంబుఁ గొనదు,
నడురేలఁ గూడ నన్నము వండి పెట్టు,

నడుగనివారె పో పడయనివారు!
కాయగూరలు నూరుఁగాయ లందించుఁ,
బిండివంటలఁ బెట్టుఁ బిలిచి వేర్వేఱ,
రెండిఁట మూఁడింటఁ బండుగో నోము
సురపితృపూజలో శుభశోభనములో
నెపముగా భూతశాంతిని నింత సేయు.
నవ్వెడుమోము కన్న మనోజ్ఞమైన
దర్శన మిల లేదు తల్లి కెందేని:
అలరిన సుప్పొంగు నాపన్నుఁ డైన
నేస్తుఁ బుత్త్రుఁడే కాని భృత్యుండె కాని.
ఆదయకులజాతిభేదంబు లెఱుఁగ
దాప్రేమ పెనఁగొను నంద ఱొక్కటిగ.
దీపమువలె నొక్కదెస మిన్కు మనదు
వెలుఁగదు వెన్నెలవలెఁ గొంత కొసరి
భువన మంతటిఁ బ్రోచుఁ రవితేజ మట్లు
లెల్లర రంజించు నింతంత లనక.

## 2.

నే నయిదాఱేండ్లదాన నైనప్పుడు
మాయింటఁ బేదబ్రాహ్మణుఁ డొక్కఁ డుండె
దూరసంబంధబంధువుఁడు మావాండ్ర,
కతిచోద్య మైనచర్యలు గల్గువాఁడు.

పురివిప్పి యాడు మోమున హాస్యరసము—
పెనుబొజ్జ చిఱుతకాళ్లను చిన్నబుజ్జి
యమవసనిసికి జో డగు మేనిచాయ—
ఒకసారి గనుఁగొన్న నొకటిరెణ్ణాళ్లు
కను మూసినపు డెల్లఁ గనుపట్టు నెదుట.
తగనివాలకమును దర్పంబు గరుసు
నాత్మసంతుష్టి యన్యాక్షేపణంబుఁ
గని యెక్కసక్కెముగా "జగజ్జ్యోతి"
యను పేరఁ బిలుచు నాజనకుండు వాని.
ఓనమా లెఱుఁగఁ డజ్ఞానంపుమూట
పోతరించినపోతు భోజనప్రియుఁడు,
ఔఁగాక మాతాత కనుఁ గైనవాఁడు,
బాల్యమునుండియుఁ బ్రాణతుల్యుండు,
వాదించి యెదిరించువాఁ డు వాఁ డొకఁడె;
కొడు కైన గురు వైనఁ గులకాంత యైనఁ
దాతను రంజింపఁ దలపెట్టరేని
వెతకి జగజ్జ్యోతి ప్రతిమాలవలయు.
ఆచను వెంచి దాష్ట్యము నెంచి శిష్యు
లాశ్రితులును వాని కడలుచు నుంద్రు.
తాత దేవుఁడు జగజ్జ్యోతి పూజారి,
తాత చంద్రుఁడు జగజ్జ్యోతి సూర్యుండు,
తాత దేహము జగజ్జ్యోతి ప్రాణంబు.

దీనిచేఁ గనులు నెత్తికి వచ్చి వాఁడు
పండితుఁ డని వెఱ్ఱిభ్రమఁ జెందుచుండుఁ
జెనఁటివాదము లాడు శిష్టులం గెలుచు
నఱచుఁ జాటించు ఠాటోకులు గట్టుఁ
గా దన్నఁ దాతను గబళింపఁ బోవు !
స్వాధ్యాయ మిసుకదం బని కేలి సేయుఁ,
బలుకుఁ దర్కము గొఱ్ఱెపం దెమ్ము లంచు,
యోగవేదాంతమ్ము లున్మాదమనును,
పాశ్చాత్యవిద్యలఁ బలుకు నెంగిలిగ.
మల్లుజోస్యులవారిపిల్లవాఁ డొకఁడు
చదువు నింగ్లీషులు మదరాసులోన
వానికత్తిరిజుట్టు వంకపాపటయు
బొట్టుగాననిమోము ముక్కుటద్దములు
గొఱకొఱ నిప్పులు గుఱియఁగాఁ జూచి
మండు నిల్వునఁ బండ్లు పిండి చేసికొను.
వానితో నొకనాఁడు వాగ్వాద మాడి
వెలనాటితెలగాణ్యభేదంబుపైని
గాఱుకూఁతలఁ గూసి కసిదీఱ కొంటి
పాటున గొంతుకఁ బట్టుకోఁ బోయె.
ఈగుణములకుప్ప నీమోహనాంగుఁ
గామించె గంధర్వకాంత యొక్కర్తు.
విను చిత్రకథ యిది వేవిను లున్నఁ

గల్పన యనుకొందు కాఁబోలుఁ గాదు—
నిజము ప్రత్యక్షము నేఁ జూచి యుంటి
మొదటఁ బరధ్యానముగ నంకురించెఁ
గ్రమముగ రేల నిద్రయందుఁ దోఁచె
నట్టె దివాస్వప్నమై యావహించెఁ
దరువాత బల్మి నిద్దురపుచ్చి వచ్చె.
ఆనిద్రలం దెల్లనపుడిప్పు డనక
తగులనీ తప్పనీ సగ మోడ్చి కనుల
తిరుగును తరులంట గిరులంట వెడలి,
కూర్చుండఁ బెట్టినఁ గుప్పించు విద్య,
లెన్ని భాషలనో భాషించు నేర్పరిగ,
నెన్నో శాస్త్రముల సాహిత్యంబు సూపు,
నెఱుఁగని దేశంబు లెన్నో వర్ణించు,
నెఱుఁగనివారిఁ జేరిడి పల్కరించు,
వ్యోమయానం బనుసామంతమాడు,
మణితోరణములు విమానము లెప్పు.
వనవిహారముఁ బల్కు వాహ్యాళిఁ గుల్కు,
సంగీతములఁ బాడు సరసంబులాడు,
విరితేనియల సోలు విరహానఁ దూలు.
తడ వుండి కొండొకవడి సేదఁ దేఱి
చూచి—యెప్పటిజగజ్జ్యోతియే మరల
కనుఁగొంద వంటిమా కలవంగ వచ్చుఁ

దనవైభవముఁ జూఱఁగొనఁ గోరినట్టు
లూరకుండినఁ జెప్పు నూరూరఁ జాటు—
"నేఁ జెప్ప లే న"ను—"నే నెన్నఁ డెఱుఁగఁ
గని విని—నీతోడు !—గాయత్రిసాక్షి !
మంచిచక్కనిపిల్ల మావాటమైన
దాహాహా దేవకన్యక నమ్ము నిజము!
నేఁ జెప్ప లేను వెన్నెలలాగు వెల్గు
బంగార మాచాయపై బలాదూరు!
తళ్కుతళ్కున వెల్గు దానినేత్రములు
నేత్రము ల్గావు నక్షత్రింపుతునుక
లే మని చెప్పుదు నెట్లు నమ్మింతు!
బుగ్గలు జేగురుపూసినట్లుండు.
అనుగకు దానిదేహం బంటిదూఁట!
తాఁకినఁ గందు, రక్తముఁ జిమ్ముచుండు,
నవి యేమో చెప్పలే నాపూలతావి !
దానిమోమున లక్ష్మి తాండవ మాడు,
మెదలినవగ లట్టె మిఱుమిట్లు గొలుపు
నొక్కతమ్మెట్లజో డొకలక్ష నేయు!
నేమి గోటనుకొంటి వేమొయారమ్ము
లడుగడుగున కుట్టిపడు నూర్వరాలు!
దానిమాటలు పంచదారకజ్జములు
అపుడు పోయెడుప్రాణ మాఱ్నెల ల్నిలుపు

నవరత్నములు రాలు నవ్వినట్లైన,
తిన్నగ మది కెక్కి తేలించు ముంచి—
తలఁచినమాత్రానఁ బులకింతుఁ జూడు!
నన్ను రమ్మని పిల్చె, ననుఁ గాన కేడ్చె,
నింటికిఁ గొంపోయె, నిట నుండ కనియె,
నీదాన నని మ్రొక్కె, నీవె దిక్కనియె,
వన్నెలు చిన్నెలు వయసు వాలమ్ము
విద్యలు బుద్ధులు వేనవే లిచ్చె.
తిరుగుదు మొకనాఁడు తేనెటీఁగలుగఁ
బండువెన్నెలఁ బోలునెండలో వెడలి.
బిలబిల మని వచ్చుపిల్లలు న్నేము
హంసల మై కల్వలంట నీఁదుదుము
మఱచితి నదియేది?—మానసంబందు.
ఱెక్కలుగల తేరి నెక్కి యొక్కప్పు
డంతరిక్షాన విహారంబు సేతు.
మాటకై పందెము లాడి యాసూర్య
కిరణము లూఁతగా ధరకు జాఱుదుము.
మేఘాలపై నెక్కి మీనరు ల్వానఁ
దడియుటఁ జూచి వింతగ నవ్వుకొందు.
మంతలో నదియొడ్డు నందుఁ గల్పకపుఁ
జెట్లనీడల లేఁతచిగురుచెంగలిని
మొలచిన వన్నె వన్నెలపూలనడుమ

నడుగులు గంద నృత్యములు సేయుదుము."
అని మొన్నొ ప్రజ్ఞల నాడు నీరీతి
భగవంతుఁ డెఱుఁగు నబద్ధమో నిజమొ!
ఉవ్విళులూరు నిట్టూర్పు నుప్పొంగఁ
బులకించు దీపించు వెలఁబాఱుఁ గందు
మఱిమఱీ ప్రియురాలు మరలి రాఁగోరఁ
నించుక యెడపెట్టనేని ఘోషించు.
వెఱఁగంది భయమొంది విందు నే నిన్ని.
యూరును వాడయు నొక్కటై పోయె;
దేశ దేశ ప్రసిద్ధిగ నావరించి
పొంగె జగజ్జ్యోతి శృంగారకథలు.
తీర్థపుఁ బ్రజలాగు తిరిగి రేఁబగలు
చిత్తరుబొమ్మలై చెవి యొగ్గి విందు
రెక్కడెక్కడివార లింతంత లనక.
"పూర్వజన్మాన గంధర్వుండు వీఁడు
శాపవశాన నీజన్మంబు వచ్చె"
నని కొంద అందురు; "పనిపాటు చేయ
కచ్చువిడిచినట్టి యాఁబోతులాగు
తిన నేర్చి మదపీడ తెచ్చుకోఁ గలిగె
జన్మములుం గావు శాపంబుఁగాదు"
అని మఱియొకకొంద "అటుగాదుకాదు
విద్వాంసులను బ్రజా లవెతఁ బెట్టె వీఁడు

వెక్కిరించెను నవ్వి పేరు వారనక
యేతపశ్శాలియో యేమహామహుఁడో
వనిపట్టి గంధర్వశాప మై పుట్టి
వీని లోకులు నవ్వి వెక్కిరించుటకుఁ
దగినయుపాయంబుఁ దలపెట్టె నిట్లు—"
అని మఱియొకకొందఱనుకొందు రపుడు.
ఇటులుండి యుండి యొక్కటనాఁటిరాత్రి
వలచినస్వప్నంబు వచ్చియో యేమొ
యిల్లఱికం బేగ నిల్లాలిపురికి.
ఎనిమిదినాళ్లు కంటను ఱెప్పవేయ
కేతఱి మాజగజ్జ్యోతి యేతెంచు
నెట్టివింతలఁ దెచ్చు నే మయ్యెనంచుఁ
గనిపెట్టియుంటిమి కానిరాఁ డయ్యె.
ప్రజల కెల్లను భయోత్పాతంబు గల్గె,
నాయూరఁ గాఁపుర మనుమాన మయ్యె,
నూరంతమాతాత గోరంత యయ్యె;
పదిఁబదిఁజొ రఁబడి పలుమాఱు తగ్గి
యింద్రాక్షు లస్త్రంబు లెన్నెన్నొ చెప్పి
తుద కెట్టకేలకు గదిఁ జొచ్చిపెఱికి
వానిమానికముంత వందరూపాయ
లినుపతాళవుఁగప్ప యేడుదోవతులు
పాదుముగొట్టము వెండిపొన్నులకఱ్ఱ

యాంజనేయస్వామి కర్పించి మ్రొక్కె :
“కా సైనఁ దినలేము నీసొమ్ము సుమ్ము
మాజోలి కెపుడు రా కో జగజ్జ్యోతి ”

---

3

ఇంతటితో వాఁడు సంతుష్టిఁ జెందె
నందున్న కాఁబోలు నయ్యయో వినుము—
వెఱ్ఱిబాగులవాఁడు వెఱగుండెవాఁడు
విస్సప్ప యని యొక్క విద్యార్థి గలఁడు.
తననీడఁ దలఁచుకతా నులిక్కిపడును,
పల్లెత్తుమా టైనఁ బడఁజాల కుడుకు,
నొకనికష్టము సహింపక తల్లడిల్లు,
నింతటితోఁ బొంగు నింతలోఁ గ్రుంగు,
నప్పుడె కొనియాడు నపుడె పోనాడు.
ఎవ్వ రేమని చెప్పునిమ్ము తా నమ్ము,
కల్లనది నమ్ము కాదన్న నమ్ము,
పాదరసంబట్లు పరుగెత్తునూహ
వెయ్యిభేదములందు విభజించునిజము:
పువ్వుగోసినఁ దీఁగ పొగులునంచడలు,
రసమానిగింజల మెసవరేమనును,
నరులకు రెక్కలుండమి కెంతొ వగచు,

దినములలనికుందుఁ బసరంబులకును.
ధారణాశక్తి యెంతయుఁ గల్గువాఁడు,
తలక్రిందుగాఁ గావ్యముల నొప్పగించుఁ
దనసహాధ్యాయు లందఱిలోన నెవ్వఁ
డెప్పు డేశబ్ద మేతప్పుతోఁ జెప్పె
నెవ్వని కేఘట్ట మేపాటి తెలియు
నెవ్వఁ డెవ్వని నేప్పు డేమాటలాడెఁ
గథలుగాఁ జెప్పు నక్షరము పోనీఁడు.
తెలికలిమాలక్ష్మి తొలిసారెగడియ,
సోముల వెల్లావు చూలున్న ప్రొద్దు,
మునసబుగారి దత్తునిజాతకంబు,
చిన్నదివాణాన సీమంతమప్డు
వచ్చినచుట్టాలు, వంసువంటలును,
నిన్నటివటుచెప్పు నెన్నేండ్లకైన!
కాని యింత ప్రయోజకత్వంపుఫలము—
జగతిఁ దా నెచ్చటెచ్చటఁ జూచి వినిన
బాధలన్నిటిఁ దనపైఁ బెట్టు కేప్పు—
సాయములేనిది సాగఁ డెయ్యెడకు
నొంటిగ మసలలేఁ డింటిలోనైన!
కాసంత సుఖమెఱుంగఁడు— ప్రతిక్షణము
దిగులొందుచునె యుండు దేనినో దలఁచి
జగమెల్లఁ దనపైని జలపట్టినట్లు:

తా వెఱ్ఱివాఁడని తలఁతురో యేమొ,
తనచాటుమాటలాడినఁ దిట్టిరేమొ,
యిద్దరొక్కెడఁ జేరి రేమికుట్రలకొ—
యనుచు ముప్పొద్దుల నడలుచునుండు.
ఇంతేల వింటివా యేనాఁడు గాని
పెండ్లిపీఁటలఁ దిగి పెండ్లాము వంధ్య
యాయి వంశ మేమౌనో యని రోఁజువాని!!

బెదరుచూపులు, వెలవెలఁబాఱుమోము,
వడలినదేహంబు, ముడుతనెన్నొసలు,
గుంటకన్నులు, నలుగోనచెక్కిళ్లు,
వట్టియోగాత్మ్యాలపుట్ట యా గుండె—
యిన్నియు విస్సప్ప— యీదివ్యపురుషుఁ
డాజగజ్జ్యోతినిర్యాణంబుఁ దలఁచి
జడిసి కృశించి యుష్ణము వెట్టుకొనియె—
తెలియఁడు దేహంబు— తినఁడు —నిద్రింపఁ
డట్టె నద్దైనఁ జయ్యన లేచి పాఱు—
పడఁకు— మూర్ఛిల్లుఁ— జల్వలఁ గ్రమ్ము, నార్చు
విరియఁ బోసినఁ జుట్టు వినరు నల్వంక,
చాలుమాలము లేక జామునేఁ పేడ్చు,
వానిఁ గన్గొనియున్న వారు గోలెత్త
వారినిఁ గని యూరివారు తొట్రిల్ల—

ఇది మాకు వేడంబ యింకఁ గొన్నాళ్లు.
ఇంతటఁ గ్రమ్మె నెల్లెడ జగజ్జ్యోతి
బ్రహ్మారతమునఁ జూపట్టె నన్వార్త—
కనుమూసి తెఱచినకాలమ్ము లేదు,
మాకు జగజ్జ్యోతిమయము లై పోయెఁ
జెఱువులు, తరువులు, జిగిఁ గ్రమ్ముపొదలు
సడవలు వాకిళ్లు నట్టిళ్లు గదులు.
కోమటిమారయ్యకొడుకు గట్టించి
సాని కిచ్చినలక్క స్తంభాలమేడ
నలుగురకును గంటినలుసు మాయూర.
దానికిఁదగినట్టు దానితోఁబుట్టు
మంచిధనిష్ఠాది పంచకంబందు
మడియుటనది పాడువడికారుబలసె.
అది రాజధానిఁగా నాసీమ నెల్ల
నేలె జగజ్జ్యోతి హృదయశల్యముగ.
మాప్రాణములు రాల్చె మాగుండె లందె
తేఫును మాపును గాఁపురం బుండె!
చీఁకటిపడరాదు చెదరుప్రాణములు,
చీమ చిటుక్కనఁ జిత్తంబు పగులు:
గాలి కాకులు సుంత కదలినట్టయినఁ
దెలిసి పిట్టలు సుంత పలికినట్టయిన
ముదికుక్క చలిచేత మొఱఁగినట్టైన

గుండెలు తలకెక్క కొంగుకెక్క మాట.
పట్టపగలు తోఁచెఁ బల్లకీమోఁత,
జటలమ్మగుడిలోని చలువపందిళ్లు
అట్టె భగ్గున మండి యిట్టె చల్లారె.
పాపలేనిది పెద్దకాపుపెండ్లాము
తలక్రిందు లై పోయెఁ దాను మంచమ్ము.
పైడినాయనిమెట్టపై యీఁతచెట్లు
ప్రద్దువాలున వ్రాలి ప్రొద్దుట లేచె.
కమ్మవారల్లుఁడు గగనంబుగాను
గొని భార్య కిచ్చినకొర్నాటిచీర
యూరఁ గట్టినబట్ట లన్నింటినడుమ
సురసుర మని మండెఁ జోద్యంబుగాను.
పింగళినరసమ్మపిన్నత్తగారు
ప్రళయంబుకన్నఁ దొంబదియేండ్లు పెద్ద
మాతాతతల్లి సీమంతంబు సూచె;
పుట్టినందఱియాయువులు గుత్తపాడె;
నేకాకి యై యూరు నిలుఁ గాయదెపుడు:
వేఁకువ నొకనాఁడు వీథివాఁకిటను
కళ్లాపు పెట్టి నల్గడఁ దేఱిచూచి
నడువీథిఁ బడి యేడ్చె —"నాకేమిదారి!
బ్రతికియుఁ జచ్చియు బాధించె దుష్టఁ
డెంతపాపము మూఁడె నీక నెట్టి పాట్లొ

పాణకంత గన్పట్టెఁ బొడుపుసూర్యుండు!!”
తుమ్మపాలెములోని దూదేకులాఁడు
చూచినట్టులె చెప్పి సూరుసోదమ్మ
అలవాన నడుగేయి నాఁకొన్న తుఱక
చలి దీరఁ గప్పి యాఁకలిఁదీరఁ బెట్టి
పోవుప్రాణము నిల్పు పుణ్యానఁ గొంత
ధారవోసినఁ గాని తరముగాదంచు.
లోకంబు నరయక లోఁగొన్న భ్రాంతి
యరసినకొలఁదిఁ బాయదు— పల్లవించు—
పదునెనిమిదినాళ్లు పైఁబడి వాఁడు
తెలివొంది యింటికిఁ దిరిగిరాఁజూచి
మట్టిన చీమల పుట్టచందాన
బెదరి బెగ్గిలి పికాపికలుగా రేఁగి
ప్రాణంబు లఱచేతఁ బట్టి గొల్లెత్తి
పురజన మెల్లఁ గుమ్మిక పర్వులెత్తె!
    ఇంతటి దని నమ్ము మీలోకసరణి:
తప్పాటూహలఁ బోవు ముప్పావు బ్రతుకు—
ఎఱిఁగిన దాని నేమఱు టందుఁ బావు—
ఎటు సూచిన నగాధ మీ ప్రపంచంబు,
కావునఁ గొండచక్కటిచీమలాగు
తెలియున దణువంత తెలియంగలేము.
అటులయ్యుఁ గడలేనిహంకార మూని

తను మించి జగమె లేదని యెంచుజనుఁడు !
పోవె నాదినములు— పోయి రాజనము
పోయె నాటిప్రమాదములును విభ్రాంతు
అప్పటిమోహంబు లావిరోధంబు
అప్పటిపంతంబు లాయహంకృతులు!
సేబాసు! దేవునిసృష్టివైచిత్రి
పుట్టుటె తడవుగాఁ బోసి పాశంబు
మృత్యువు బిగలాగు నెప్పుడో యెటులొ !
క్షణమిత మీప్రపంచ వుటద్దెగడువు
తనువు నీర్బుగ్గ హెచ్చును విచ్చుకొఱకె,
చూరున వ్రేలునీర్చుక్కజవ్వనము—
అయింతలోనె బ్రహ్మాండభాండంబుఁ
గొనగొట మీటింపఁ గొనకొను జనుఁడు.
ఇంతటిలోని వే యిన్ని కన్కట్లు
మెఱమెచ్చు లీనులు మిత్రభేదములు
దివి భువి నిండిన దీర్ఘసూత్రములు-
అప్పటి కిప్పటి కారార భేద!
మాకాలమే వేఱు లోకంబె వేఱు!
ఉందునా చిఱునాఁటియుత్సాహ మిపుడు ?
ఆవీనులే వాఁడి యాచూపె చుఱుకు.
అడ్డమైనదియెల్ల నవుహూవ మపుడు.
అప్పటివేడ్క నవ్యము నిర్మలంబు.

ప్రియవిప్రియమ్ములు భయవిమోహములు
కృత్రిమములు గావు ఖేదమోదములు.
రాను రా మేలిమి రాగితోఁగలువుఁ
దన రాటుపోట్లకుఁ దగినట్టు జగము:
నిశ్చయ మప్పుడు నిజము, విశ్వాస,
మనుమాన మిపుడు లౌక్యము, సంశయంబు.
చెలిమి యప్పుడు యథోచితభావ మిపుడు.
ధర్మ మప్పుడు లేదు ధర్మంబు దక్క,
మమత లేకున్న ధర్మము తోఁచ దిపుడు.
వెలువడు విచ్చలవిడి కోర్కు లపుడు,
మును వెన్క లరసి యిప్పుడు సాగ వెఱచు.
బ్రతుకుటెడారిలో బాల్యంబు నీడ,
బ్రతుకుసముద్రాన బాల్యంబు రేవు,
బ్రతుకుటౌషధముకు బాల్యంబు తేనె,
బ్రతుకనుచెఱసాల బాల్యంబు మెట్టు.
కావున దాని కై కాంక్షింతు మెపుడు
పాంథునిమన సింటిపై బాఱునట్లు
వడఁ గొన్ననోరు చల్వల కూరినట్టు
లావంతతలఁపు సంజీవి యై తోఁచు
మనసు వాఱిన దేని మఱలింపలేము!

---

## 4.

మఱవను జన్మాన మాయూరు నిల్లు
కనుల కిప్పటికిని గట్టిన ట్లుండు
నెదుటను ఋషిపత్ను లిరవున్న మఱ్ఱి.
అన్నముఁ దినిపించు చటువంకఁ జూపి
మాయవ్వ యెవ్వేళ మాకు బోధించుఁ:
"దల క్రిందుపనులకుఁ దల క్రిందు బ్రదుకు—
పతులను శాసించుసతుల కీజన్మ!"
పజ్జను జదువులబడిపంతు లొకఁడు
చిఱుతమేధలఁ దెచ్చి చిత్రిక నట్టు.
ఇష్టము కుదిరెనా యెల్గెత్తి యఱచు
నమరము బాలరామాయణ మాంధ్ర
నామసంగ్రహ మర్థనాశంబుగాను,
లేకున్నఁ బడఁదిట్టు లేచి నడ్డించు.
చింతబెత్తములకు చిల్లతాళ్ళకును
గోడ కుర్చీలకు కోదండములకు
సాతానిమనవాళ్ల సాటిగా రెవరు—
పిల్లలపిడుగని పేరు మాయూర.
అయిన నెత్తురుఁ దీయు టంకిళ్లు నొవ్వ
వల్లె వేయించుట వానికే చెల్లు.
అనుదిన ముదయాన మనవాళ్లదూత
లింటింటి కేగి బోధించి బాధించి

సత్తువకోలుఁదిని సాయమ్ము వట్టి
పశువులఁ దెత్తురు బలివీరమునకు.
    దిగుదల శారదాతీరంబునందుఁ
జడు నైన కవకొండచఱియలలోన
బలసిన యుద్యానవనవాటినడుమఁ
బెనుపచ్చలందుఁ దాపినవజ్ర మట్లు
వఱలు జనార్దన స్వామి దేవళము.
అడుగిడ నేర్చిన దాదిగా నేను
దమి మీఱ నరుణోదయముసందె లేచి
నదిఁ గ్రుంకి స్వామికి నతిఁ జేసి వత్తు.
అమ్మ సెప్పును దేవుఁ డఖిలైకవిభుఁడు
పరమదయాళుండు పరమపావనుఁడు
న్యాయస్వరూపుఁ డనాథనాథుండు—
నమ్ముదు మనసార నాపాలివాఁడు
నాపెన్నిధానంబు నాభాగ్య మంచు.
ధ్యానింతు భయవిషాదములు వోనాడ,
మ్రొక్కుదుఁ గల్యాణములకు మూలముగ,
వినుపింతునా చిన్ని వెత లొక్కటొకటి,
పలుకుదు భావంబు బ్రత్యక్షముగను.
నాఁడు దైవంబు ముందటివాఁడు నాకు
దయమాలి నేఁడు వేఱయి నాఁడుగాని—
కయ్యాల గొండిలోకంబు ధర్మానఁ

జడిమె నానమ్మిక చెడె వానికరుణ.
    దవ్వుల మినువ్రాలి తగులు నందాఁకఁ
గనుచూపుమేరలఁ గనులపండువుగఁ
గమనీయసుక్షేత్రఖండికలందుఁ
గారున కొక్కసింగారంబుఁ దీర్చి
నర్మిలిఁ గొలువుండు నవధాన్యలక్ష్మి
ప్రజలకోర్కుల మించుభాగ్యంబు నించి—
ఇచటనె తొలుదొత్త హృదయమ్ము లతుక
నేనును బ్రకృతియు నెయ్యంబు నేఁత.
నిష్కామమైనట్టి నెన రుట్టిపడఁగ
ముద్దినుసుల కాన్క ముక్కారు దెచ్చు:—
వెలివాఁకిటితురాయి విరిసెఁ గ్రిక్కిఱిసి
యామనికి నివాళి యందించినట్లు;
చిగురెత్తి తేనెఁ బూసినయట్లు రావి
నీటిమబ్బుల లేఁతనిగ్గులఁ దేఱె;
మల్లెలు విరజాజు లుల్లంబలర్చె;
విభుఁడు మెచ్చని దేటివిభవం బటంచుఁ
గమలిని వికసించెఁ గై సేసినట్లు;
కోర్కులీరిక లెత్తెఁ గ్రొమ్మావితోఁట
కందంద గర్భచిహ్నములు సూపట్లు;
మ్రొక్కులిడుదు మేము మోహంపుఁ దేల్చ:
"తల్లిరో వనలక్ష్మి దయచిత్తగించి

మాఘుద్దుగున్నల మనుపు దీూవోఁడు
తేనెమంచులమబ్బు తీక్ష్ణంపుటెండ
సుడిగాలి చిలుకలు వడగండ్లవాన
రానీకు—నీ కుపారములఁ బెట్టెదము."
కోయిల కయిపెక్కి క్రొన్నన లెక్కి
ప్రియురాలిఁ గో యని పిలిచినపిలుపు
మనసున కవ్యక్తమధుర మై తోఁచి
నను నిలు వెడలి రమ్మనినట్టు లయ్యె.
ఇప్పటి కఱువదియేండ్లపై మాట—
కోయిల మొందేనిఁ గూసినట్టయినఁ
దలఁపుటెక్కలఁ గట్టు కలనాఁటి కెగురు:
మరలును బాల్యంబు మాయిండ్లతోఁట
లాజీడిపువుఁదావి యామావిచిగురు
లాచూలుమేఘంబు లైంద్రచాపములు.
ఉదయరేఖలతోడ నుజ్జిగా వెడలి
యమృతధారలఁ బాడు చాకసంబునకుఁ
జివ్వన భరతంబుజవ్వలా గెగసె.
పాలపిట్టలు రెండు ప్రతివత్సరాది
రచ్చటాదరి వేఁపరావిదంపతుల
ప్రావుల గూడల్లి పాపలంబెట్టు ;
నీవ ముచ్చట మాకు వానియనోన్య
మాకట్టు గుట్టు నెయ్యపుటాట పాట.

లెడలేనిమొలకువ యింటిపైఁ దీపు—
నిశిలేనిపగలట్టు నెగడె జన్మంబు,
గాలి సవారుగాఁ గాలంబు గడచె,
సయ్యాటగాఁ దోఁచె సంసారభరము.
కాని యెంత నిరోర్చుఁ గలవారిఁ జూచి
కనుల నిప్పులఁ బోసికొనెఁడె దైవంబు!
పగపట్టినటు వచ్చి పాపిష్ఠి పాము
పాపలలో నొక్క పాపఁ గొంపోయె.
కటకట వానిదుఃఖము నేమనందు !
కుత్తు కెండినదాఁక గూఁటి కావలను
బరుగెత్తు నడలుచుఁ బరుగెత్తి యలసి
కూర్చుండు తడవుండి ఘోషించు మరల.
కని విని హృదయంబు గరఁగి గాసిల్లి
తలఁచుక తలఁచు కెంతయు వంతఁ బడుదు.
కూడఁ బెట్టినసొమ్ముఁ గోల్పోయినట్లు
తలవంపు లగుతప్పిదముఁ జేసినట్లు
మది ముస్గి చొరనీదు మఱి మాఱుతలఁపు.
తొలిచవిఁ జూపించె దుఃఖంబు నిల్లు
తిర మగుచూస్థాన దేవుండు నాకు—
అటపయిఁ గొన్నాళ్ళ కాంజనేయుండు
ముద్దులతమ్ముఁడు మోహనాంగుండు,
నవరత్నములమూట, నలినకోమలుఁడు,

పులుఁ గడిగినముత్తెములచాయ వాఁడు,
కలిమి కొల్వున్న వాల్గన్నులవాఁడు,
నవసుధామయభాషి, నవ్వుపూదండ,
అపరంజిబొమ్మ, నాయాటమానికము,
నాబహిఃప్రాణంబు, నాతోడునీడ,
నాజన్మబంధంబు, నాకంటివెల్గు—
డిరిసెనపూ వెత్తుదేహంబుఁ దాను
భూమికి భారమై పొడుపులో గ్రుంకు
నెలవంక బోలె—నా నెనరులబరణి
యాటపాటలఁ దన్పి యడియాసఁ గొల్పి
మురిపించి మఱపించి మోహాన ముంచి
ముంజేత నిడుకొని ముద్దాడువేళఁ
జెంగున బరువెత్తు చిల్కపోలికను
కనులకు మిఱుమిట్లు గావించి యట్టి
వేషముఁ జాలించి వేల్పులం గలిసె—
శ్రీకృష్ణుఁ డానాఁడు చేయూఁత వేఁడి
సారముఁ దోడ్కొని చన్న బీభత్సుఁ
డెత్తఁటి గాండీవ మెత్తలేనట్లు
తమ్మునిమరణంబు దలపోసిపోసి
తలిదండ్రు లొందువేదనఁ జూచి చూచి
జాలియుఁ బారవశ్యము వెల్లివొడువఁ
జాల నోచనివట్టిశవ మైతి నేను.

గాటంపుఁజీఁకటి కను మూసినట్లు
లోకము నాకాశ మేక మై తోఁచె.
తరఁగలుగాఁ గ్రమ్ము దైన్యంబునందు
మున్ని భూతభవిష్యములు రూపుమాసె.
మున్నీట నుడివడి మున్గ నున్నట్టి
నావ కే్రివలఁ జిక్కి నలుచక్కిఁ జూచి
మునుకొని మున్లోకముల ముంపఁ జాలు
విపుల మనంతము విశ్వతోముఖము
జలమహాభూతంబు సాక్షాత్కరింప
నదరుచు భయవిస్మయములు ముప్పిరిగ
మునుఁగకుండని చచ్చుజినునట్టులైతి.
ఆనాఁడు చెదరిన నానాళ్లు మరల
వానాఁటిగాయంబు మాన దెన్నటికి.
చిరజీవి కాఁదలంచినవానిఁ ద్రోసి
యీదుక చిరజీవ మయ్యె దుఃఖంబు.
ఇంతియ కాదు నాహృదయంపుఁగొలను
స్వచ్ఛ మై నిశ్చల మై దేవుఁ డనెడి
సూర్యునిఁ బ్రతిఫలించుచు వచ్చి వచ్చి
యానాఁటిసంశయ మనుజాలఁ జెదరి
నేఁటి కాస్తిక్యంబు నెలకొననీదు.

* * * *

సుఖములఁ జొక్కించె—స్రుక్కించె వెతలఁ—

గల్లుముల మఱపించె—గర్వంబు డించె—
వేడ్కల కూరించె—విసిగించి యలఁచె—
భయపెట్టి గడిదేర్చె—భ్రమపెట్టి దిద్దె—
తను విట్టి దని చూపెఁ దన్నంటిపట్టి
నట్టిదానను దేవుఁ డిట్టుగాఁ దేల్చె.

---

## 5

ఎల్లర కెంతో నే నల్లారుముద్దు—
పేరు జాహ్నవి—పిల్పు పేరె జన్నమ్మ.
నడువ నియ్యరు నేల నాతల్లిదండ్రు
లిత నగుతగులంబ నే బాల్యదశకు—
విహారసౌఖ్యముల కెల్ల నేఁ బ్రాతిపదిక ;
కాశీప్రవాసాంధకారంబునుండి
యిలుపొడ సూపించుతొలివెల్గు నేను—
నాయందు మక్కువ—నావచ్చిరాని
పలుకులు కలకండ, భావంబు తేనె.
రస మెఱింగినదానఁ బసినాఁట నుండి
యూహాలు గలదాన నుచితజ్ఞురాల—
నర్మగర్భంబులు నాచమత్కృతులు,
కేలిప్రశ్నలు నారికేళపాకములు !
"పుట్టుబుద్ధులమారి"—"పోకిళ్లపోరి"—

"ప్రేలుడుంగాయ"—"గయ్యాళి"—"ముల్లాడి"—
యనుచరకూరిమినరమత్సరమున
బిరుదు లెన్నియొ పెట్టి పిలుచు నక్క దాత.
ఆఱేండ్లప్రాయంబునం దొక్కనాఁడు
మండువేసవి మట్ట మధ్యాహ్నమందుఁ
బ్రళయాగ్నిశిఖలట్లు పైకొన్నయెండ
నెడపెడవడగాడ్పు లెగలెత్తువేళ—
త్రాగి నైమఱచి కొండఱు బెస్తవాండ్రు
మగనాలిజగడాల మరఁగి సిగ్గడలి
మృగములవలెఁ బోరి మొదటినెత్తుళ్లు
దోడదోడ మని పాఱి దుర్భాషలనుచుఁ
బొడివిపట్టి పెనంగుచుదరి డీకొనుచు
గొల్లున గోలెత్తుకొని మోఁదుకొనుచు
విడివడి సొచ్చిరి వీధివెంబడిని.
నిలువెల్ల నీరయి నిర్ఘాతపడుచుఁ
గాంచి తదేకదీక్షగఁ గొంతసేపు
రోసము భయమును రోఁత యొక్కొకటి
హృదయముఁ జెకలింప నిఁక నిల్వలేక
గిఱ్ఱునఁ దిరిగి లోఁగిటిలోని కరిగి
చుఱుకుఁజూపులఁ దండ్రిఁ జూచి యిట్లంటి:—
"చాలక కాఁబోలు సహజకష్టములు
"పనిపట్టి మూర్ఖులు కొని తెచ్చుకొంద్రు!

"దైవికమగునాపదల కన్ననూఱు
"తడవ లెచ్చు స్వయంకృతము లంచుఁ దలఁతు"—
మఱికొంతకాలాన కరుదైనపూర్ణ
సూర్యోపరాగంబు సూపట్టె రెండు
గడియలు కటికిచీఁకటి గ్రమ్మె దెసల.
తలవాడు పడిన క్షుద్రులు హెచ్చినట్లు
చుక్కలు చదలందు శోభించి నించె.
చలివలగొనెఁ గల్లసంజఁ బాటించి
పక్షులు కళవళపడి గూండ్లఁ జేరె—
నదినాడఁ బోవుచు నాన్నతో నంటి:—
"నిటులె చిత్తము నానరించి దుర్బుద్ధి
"మఱివెల్లనీయక మాపుఁ దేజంబు!"
మాటికిమాటి కీమాటలదవులఁ
దవిలి యూఁకలి వాయుఁ దండ్రి—నా ప్రజ్ఞ
లింటను బొరుగున నితిహాసకములు.
చెవిఁ బడఁ దప్పు—చెచ్చెర పీడివచ్చి
దృష్టిదోషము నట్టి తీయు మాయవ్వ!—
ఒక్కసంతకె నేర్తుఁ బెక్కుపద్యాలు,
వినికిడిపై వచ్చె వేదసంహితలు,
పారాయణము సేతు బ్రహ్మసూత్రములు,
గీతయు నిత్యంబు తాత వెంబడిని.
మాసంగడపుతుంగస్మార్తధర్మంబు

సగపాలె మొదటికి శ్రౌతతంత్రములు!
తోడపయి నిడికొని తోఁబుట్టు లట్లు
నూఱిపోతురు శాస్త్రసారంబు నాకు
శిష్యులం దొక్కఁడఁ జేరిక మెండు :
తాఁకేశు నీశునిఁ దలపించుఁ జేయు—
మొగలిపూమైడాలుఁ, మగమీలు కనులు,
ఫాలపట్టిక సరస్వతిసింహాపీఠి,
పస లొల్కుమైదీగ బ్రహ్మతేజంబు;
చిఱునవ్వుమోము క్రొంజిగి కంగువెట్టు,
మురిపెంపుసిగ్గు ప్రేముడి హెచ్చరించు.
కపటము కక్కుర్తి కల నైన లేవు,
ప్రల్లదములు రావు, పొల్లుమా టరిది.
చదువుసరస్వతి, సరసంపువాఁక,
గురుకులదీపంబు, గుణరత్నరాశి—
నడక మున్నుగ నాదునడతల కెల్ల
చిఱునాఁటివరువడి—చిత్తంపుచిగురు.
తలఁతు మానవులందుఁ దలమానికముగ.
ఆకదలికలె నాకతిమనోజ్ఞమ్ము,
లాప్రమాదభ్రాంతు లేప్రమాణములు.
వాక్యార్థములయందు వాగ్వాదమందు
పూసుక వత్తు నబ్బుర మంది మెత్తు,
విజయంబుఁ గోరుదు—విని సంతసింతు.

నాన్నపొగడ్తలు నాకబ్బినటులె
భావించి మనసార బరవసంపడుదు.
డెందములోపలి డెందంబునందు
నాకును వినరాని యేకాంతముగను
గోరుదు భర్తగాఁ—గోరి యాయింతఁ
దలఁకుదు నే నంతదాననాయనుచు.
తమకంబునై జనార్దనదేవుచరణ
సన్నిధి మన సిచ్చి విన్నపం బిడుదు.
చిఱునాఁటినుండి మాచిన్నాయనమ్మ
తలఁచు నన్నిష్ఫింప దౌహిత్రినకును.
మహిమలు గలవారు మాపట్టికెల్ల
నాగ్రహారికులందు నగ్రభావితులు
సంపన్ను లసమానసాంప్రదాయికులు
కలుము లోర్చినవారు కడియాలవారు.
తొల్లి రాజపురోహితులు మంత్రవిదులు—
అందునఁ బూర్ణపట్టాభిషిక్తుండు
కూటస్థుఁ డొక్కఁడు కులభూషణుండు
దండిమరాటీలు దండెత్తినపుడు
రాజును రాజ్యంబు రక్షింప నెంచి
మంత్రించి తులలేని మహిమం బెలర్పఁ
ద్రిప్పె నెవ్వానికత్తిని వానిపైకె. —
నాఁటిదిభాగ్యంబు నాఁటిదా కీర్తి.

అతనిభార్య సుభద్ర యపరసావిత్రి
భర్తను ముమ్మాఱు బ్రదికించె నండ్రు
యమునిధాటికి సతీత్వము నొడ్డిగెల్చి.
మగిడి నాల్గవతూరి తగవాడి యోడి
మెప్పించి యమరులు మేల్మే లనంగ
జన్మజన్మములకు శాశ్వతంబుగను
వరు నంటియుండఁగ వరముసాధించె.
అంతటితో సరి యామహత్త్వంబు
లానాఁటి కానాఁటి కవిపూజ్యమయ్యె.
పూర్వోద్ధతిఁ దలంచి పొంగి స్తోత్రించి
యప్రయోజకు లయి సుప్రయోజకుల
విన్నఁ బుచ్చెడి కులవిద్యలై మిగిలె !
సిరి హెచ్చరిలెఁగాని చరితార్థమేమి?—
సిరి గరళము — బుద్ధిచే శుద్ధివలయు.
సిరి కరయమి చీడ—సిరిరోడ, గుణపుఁ
జుళ్కానిలే కీడ్పు నుడిగుండములకు !
ఆవెంకటేశాని కాటదీజగము—
కరుణించి నరకీటకములందు వెలసెఁ
గాకున్న వినువీధి కడవీధివాఁడు !
పంచవన్నెలచిల్క, పందెంపుఁగోడి.
బాడిదపూబంతి, పైఁబూఁతబొమ్మ,
మూటలగతిగమ్మ, మరియాదమిర్చి

విద్యలకొఱకచ్చు, వేసాలముచ్చు.
తలపెట్టినం జాలుఁ దలకెక్కుమంట—
ఆ మోటుసరసంబు, మోమోటలేమి,
ఆతలవిసురు, ప్రాయంపుముజ్జోరు—
నలువ చాలఁ డొకండు నను వానిఁ గూర్ప!—

ఏమి గానిమ్ము నాయిష్టదైవమ్ము
నాయభీష్టముఁ దీర్చె, నానోము పండె.
పదునొకండవయేటఁ బరిణయంబైతిఁ
బాసితిఁ బుట్టిల్లు పదునెన్మిదింట—
చేబిడ్డ నీయత్త చిలుకలకొల్కి,
పాలపాపఁడు నాన్న పసినిమ్మపండు.
బాలబృహస్పతి ప్రతిమన్మథుండు
మీతాత తేజస్వి మేధాయశస్వి.
నేనందువా! నేర్తు నిగమాగమముల
రాజమార్గముల నిర్భయవిహారంబు.
ప్రాపించితినఖండరాజయోగంబు,
పొందితి మానుషానందంపుటవధి.
ఊహలు చెలరేఁగె, స్వోత్కర్ష హెచ్చె,
కోర్కులు కొనలెత్తెఁ, గూర్ము లల్లుకొనె,
బ్రతుకు నందనవిహారంబుగాఁ దోఁచె.
భవమహార్ణవమందుఁ బవనార్భకములు
నిద్దపునీరము ల్నిర్మలాభ్రములు

వెల లేనిముత్తియములు ప్రవాళములు
నాగకన్యకలె గన్పట్టె నెల్లెడల !

---

## 6

నిన్నటివలెఁ దోఁచు నే నిల్లువెడలి
నాశారదను బాసి నాజనార్దనుని
నాతల్లిదండ్రుల నాయాటబోటుల.
కుదుటఁ బోసిననాఁటి చెదరి యొక్కొక్క
పెరట నాటినరీతి విడిపోతి మిటులు
తోఁ బుట్టువులు నేనుఁ బోఁబెట్టి పేర్మి.
ఎన్నఁ డుంటిమొ పుట్టినిలుగూటఁ జేరి
ఱెక్కలు రాఁ బోతి మొక్కొక్కదెసకు.
చెల్లి సాధ్వీమణీ—శ్రితకల్పవల్లి,
నెనరులచెట్టు, పున్నెములచేపట్టు.
తల్లియె సిరి సంపదనుశీలముందు.
చక్కనికాఁపురం బక్కజంబైన
వసతివాఁడియు— దివ్యభవనంబు లిండ్లు,
పాఁడిపంట ల,ఖండభాగ్యభోగ్యమ్ము,
లాణిముత్తెములు సంతానంబు—మాట
కడుగు దాఁటఁడు భర్త యాత్మలోనాత్మ,

చాఁనల కిదె గదా సామ్రాజ్యపదవి.
కాని వట్టిపురాణకథలె నాకిన్ని
చూడను బహువాలుగేఁడు లై దానిఁ
గనులకుఁ గఱ వయ్యెఁ గాలంబు జ్ఞప్తి
చుట్టుపుట్టలఁబోసె సుఖదుఃఖములకుఁ
బెఱవార మైతిమి: ప్రేమబంధంబు
తీఱనియూఁకలి తీరుగా, మదికి
బరు వయి కరము దుర్భర పుట్టు తోఁచె.
తమ్ములలోఁ బెద్ద తమ్ముండు మిన్న
(ప్రాపితామహుపే రుమామహేశ్వరుఁడు).
తక్కటివా రెంత దండివా రైన
నైశ్వర్యములచేత నధికృతిచేత
పరిరారు ధర్మదీక్షను వాని కెవరు—
ఆంధ్రగీర్వాణంబు లందాంగ్లమంగా
చక్కనిసాహితి— సరసంపుఁగవిత,
బహుశాస్త్రపరిపాటి, పరమార్థగోష్ఠి,
సౌమ్యత, పరమతసహనంబు, సమత,
సాత్త్విక, మీశ్వరార్చన, మార్జవంబు—
తమ్ముఁడు మాతండ్రి తపములఫలము.
సదయుఁడు, విమలుండు, సత్యసంధుండు,
నిశితవ్రతుఁడు, మానవిధి, దీర్ఘదర్శి—
పరదారధనములపయి గాలివడఁడు,

పగతు నైనను గాసిపడఁ జూడనోడు,
నొప్పింపఁ డెవనిఁ, దా నొచ్చి వేసరఁడు,
ప్రేమించు మనసారఁ, బ్రేమింప నుబ్బు,
గోరంతయుపకృతిఁ గొండగాఁ దలఁచు,
నవ్వి మాటాడిన నన లెత్తివిరియు,
నమ్మితి నన్నఁ బ్రాణము ధారవోయు.
పాపము మెఱుఁగఁడు వ్యాజం బెఱుఁగఁడు;
త్రికరణశుద్ధిగా దిగు నెట్టిపనికి,
ఒగ్గఁడు విజయాగ్ర మొందునందాఁక.
కేలు మోడ్పఁడు పుణ్యశీలిగాకున్న,
కైకొనఁ డాకస్మికప్రభావముల—
ఇన్ని గల్గియెగాదె యీలోకమునకుఁ
గొఱగాఁడు తమ్ముఁడు కొఱగానియట్లు
వాతరోగికి స్వాదువర్షనీరంబు!
అరిపేదశిశువున కచ్చావుపాలు
గురుభక్తియగునట్లు కుత్సితం బింత
కలగల్పు గాక లోకమునఁ జొప్పడదు
తీవ్రనిర్మలధర్మదీక్ష యెన్నటికి—
అడవుల మరగి రాజయి సంచరించు
దంతావళము దిడ్డిగంతలోఁ జిక్కు-
పగిది మహేశుండు ప్రతికూలు డైన
మునికిత మూని జీవన మీడ్వవలనె:

(ఇంటనొంట నొకింత యెఱుఁగ మేనాఁడు)
మనరాజవిద్యల మరియాదె యింత.
పొట్టపోఁతయె వీనిపూర్వో త్తరములు
బ్రదిమి చేకూఁగుటె పరమోపలబ్ధి—
పరవశతను బెంచుఁ, బరహితం బడఁచుఁ,
బ్రత్యక్షమునె గొల్పుఁ, బరమార్థ మెడపు,
భవతృష్ణ నించు, లోభము వేగిరించు—
నాతండ్రి మెచ్చఁ డెన్నఁడు నాంగ్లశిక్ష.
కనికర మేవ మొక్కట వెన్నడింపఁ
బలుమఱు లోకానుభవభంగిఁ బలుకు :
"కంఠము దాఁట దాఁకలి దీఱ దఱుఁగ
దరుచి దేశీయవిద్యలయందుఁ గొల్పు
మదిఁ గృశింపించును హృదయంబుఁజలము
మోసమునను రోగములకుఁ బాల్సేయు
నేలొకో యీచేఁతపాలార్యజులకు!"
ప్రత్యూషతుహినసంస్పర్శచే విరియు
చేమంతివిరులట్లు చిత్తంబు నవ్య
సౌమనస్యముఁ జెంది సంతుష్టిఁ దేలఁ
జక్కఁగా సెలయేటిచక్కి బాడువలఁ
జల్లినపాల మట్టులల్లి వర్ధిల్లు
కులవిద్యలను నేర్చి కూలంకషముగఁ
దాతతండ్రుల సంప్రదాయంబు గాను

జగదేకపండితుం డగుచు లోకంబుఁ
దానును దరియింపఁ దరణిగారాదె!
కులధర్మములఁ గొల్చి గుణధనుం డగుచు
నగుల నిర్దంభ నిర్వ్యాజ నిష్కామ
సౌహార్ద మలరార సకలలోకంబు
తనకుటుంబమె కాఁగఁ దనకుం గలట్టి
సామర్థ్య మడరించి సవరింపరాదె!
హూణవిద్య లివేల యుత్కర్ష లేల
ఉద్యోగముల వేల యూడిగం బేల
తీఱక పురికొల్పు పేరాస లేల?—
చెల్లదే విజ్ఞాన సింహాసనంబు
బ్రతుకుతె ర్వనుముచ్చుబంగారు లేక!
సమకూరదో కో పౌరుషపుఁబూర్ణసిద్ధి
సరివారి నొప్పించి జగము వంచించి
స్వప్రయోజనముల సాధింపకున్న!
విద్యల నననేల? విద్యలం గఱచి
విడిముడి కేల దుర్వినియోగపఱుప?
పఱచెఁ బో యతుకని బ్రతుకెబ్బు టేల?
తా నెత్తినప్రభుండు తను మట్టు టేల!
విద్యల నననేల విధిచెయ్దములకు!
హా! విధి కోగాత్యమా పాపభయమ?
ప్రకృతికి మోమోటమొకో? నీతియొకో?

రాఘమునంతటిమేటి రారాపువెట్టె !
మఱపిచ్చి ప్రజ్ఞలు మన కబ్బురంబు
పొసఁగమి సృష్టికి లోనుగుఁ గాఁబోలు !
అనిమొనఁ గురువీరు లదరఁ గ్రందైన
సుభటులఁ జెండాడి సురవృష్టి గురియ
జయలక్ష్మి కెదురయి సామంతమాడు
నభిమన్యు నొక్కఁ ద్రోహపుఁగోలఁ గూల్చు
నక్కటి దైవాన కౌచిత్యమేడ !
ఎంతధన్యుల కబ్బు నీశ్వరుం డిడిన
శక్తులు కొఱగల్గి సఫలంబు లగుట!
స్వల్పభాగ్యము గాదు సక్షేత్రమందుఁ
బడి మొల్చుబీజంబు వలె సద్గుణంబు
క్షీరశర్కరలట్లు చిత్తంబు లత్తి
రసపూర మగుచోట రాణింప నగుట.
పదివేలలో నెన్నఁ బడఁడు తమ్ముండు
ప్రభుహిత మరసి స్వార్థము రోసి యిహము
పరమును గూడఁ గోల్పడె —నమ్మి చెడియె.
సారమతుల వెచ్చనూరుపే తిండి
కన్నీరె డప్పి యక్కట! పాడువిధికి!
సుఖదుఃఖములసార మఖిలశీలంబు
దేనిపా ల్బలమగు దానిరూపించు.
వఱదపై నసియాడువంతెనం జిక్కి—

యిటునిటు గూడ రా నలవిగా నట్టు
తగనియవస్థలోఁ దగిలి తమ్మునికి
సహజమంజులవికాసము మాపుసూపె.
సహజమాధురి—పాలఁ జవిగల్పినట్టు—
విఱిగి యంతతకు వెగటుగాఁ దొడఁగె.
చెదరె నుత్కంఠ నిస్పృహాతనూపట్టె.
స్వార్థలోకార్థపోషణ ముట్టి పెట్టి
బ్రతుకుటే రింకునన్ పలవింత పుట్టె—
నే నేమిసేయుదు—మాని రమ్మన్న
వినఁడు లేఁగనుఁదల్లివిడ నొల్లనట్టు,
వినడు ప్రాణముఁ బ్రాణి విడనొల్లనట్టు.
భగవంతుఁడే వానిఁ బాలింపవలయు:
శ్రీపతియే వానిశ్రీరామరక్ష,
వానిసౌశీల్యమే వజ్రవర్మంబు—
చీఁకటిచేఁ జిక్కి చీకాకువడిన
దిశ లెల్ల నుదయాన దీపించుకరణి
బన్నమువడి భంగపడి యెట్టకేల
కందును సౌజన్య ముభ్యుచ్ఛ్రియంబు.

—

## 7

వినఁ గోరుదువు నామువృత్తాంత మింక.
ఇరువది యేడేండ్లు — పరమాత్మునెఱుక —
మంటిని భవముపై నుసులు గొన్నట్లు.
నడిచెను రబ్బరుంగాలిబండి నెక్కి
బలపంపుఁబలకలబాటపై బ్రతుకు.
చారునాటక రసాస్వాదంబునందుఁ
దెలియ కేగెనురాత్రివలె జాఱె నేండ్లు.
సుమదామ మైన భారము తోఁచుఁ గాని
భవ మలంకృతి కయ్యెఁ బరిమళంబునకు.
స్వారాజు మముఁ జూచి నోరూరనోపు.
పంతము లాడి భూపతులు పూజింత్రు.
వైదికనిష్ఠకు వైదుష్యమునకు
వరశీలమునకు దేవవ్రతంబునకు
శిష్టులు సేవించి శిరసావహింత్రు.
శ్రీవాణు లొకగద్దెఁ జెల్మిఁ గొల్వంద్రు!
జతగూడుఁ బదవికి సంతానపదవి:
చక్రవర్తులకు మాసంపత్తి లేదు.
పూవుఁ దావియు ధర్మమును ధర్మియటులు
పాయము కల నైనఁ — బ్రత్యేకభాగ్య —
మొండొరుసుఖమె మాయున్కి కాదరువు.
మణిహారమందుఁ గ్రుచ్చినసూత్ర మట్లు

లొక్కటి మనసు మాయెడలె వేర్వేఱు—
పరిమితి లేనట్టిభవవైభవములఁ
జూజు లిచ్చి సుఖానఁ జొక్కింపఁ దలఁచి
యత్యంతవాత్సల్య మలరార దేవుఁ
డెదురుటద్దంబుల కెత్తినదివ్వె
కీలిప్రేముడిఁ బెంచిప్రీతి తళ్కొత్తఁ,
బెనిమిటి యని, పిల్ల లని పేరు వెట్టి
యాత్మకుఁ బ్రత్యాత్మ లడరింపఁ బోలు!
ఇదియె నామధ్యాహ్న మింతటంగోలె
దిగుమొగం బైతిని దేజంబు దక్కి.
సరిపోయె జన్మంపుసాఫల్య మింత
బ్రదికితి మీశుభాభ్యుదయము లూన్పడ.
కాని మున్పటినీడ నైనఁ గానైతి.
కానైతి నప్పటికలపాటి నైన.
ఱెక్క వో డాపలిఱెక్కతో నెగిరి
తక్కినజీవయాత్రను సల్పవలసె.
దండ గోల్పడి యొంటిదండ నే నమ్మి
సంసారపుసవారి సాగింపవలసె.
నెనర నుచెలికత్తె నెయ్యంబు నెఱప
నిజమృతసంజీవనీయోగమహిమఁ
జిరముగ నెలకొల్పు స్మృతివైభవములె
పూర్వభోగముపేర భుజియింపవలసె!

తావపుఁదోలిపొంగు తగ్గునందాఁక
కొన్నాళ్లు మతిఁ దప్పి కొందలంపడుదు.
వెఱతు ముంగలఁ గ్రమ్ము విపినంబు నరసి,
వగతు నైహికమోహవైయర్థ్య మెంచి,
మానుషారంభసంరంభంబు నగుదు,
మానుషవైదగ్ధ్యమద మీసడింతు,
ప్రకృతితాఁకున వ్రీలుభవ మక్కటింతు,
నలువురసాటైతి నని విన్న నొందు,
ప్రాణమునకుఁ బ్రీణ మర్పింపలేని
దౌర్బల్య మెంచి వంతయు సిగ్గు వడుదు.
చదువులు కోటి నైజము పాటిగావు—
తనువులు పోయినఁ దమకము లొప్పవు.
పంజరమును వీడి పరిచయంపడని
యాకాశములఁ బట్టి యరుగు రాచిల్క—
చలికిని వేఁడి కాఁకలికి డప్పికిని
బడలునో యని వట్టిపామరత్వమున
భోజన మనుపేరఁ బుట్టమన్ పేర
యానము లనుపేర దానము ల్సేతు!
కీర్తిశేషులమూర్తి ఖిలము గాకుండ
మర్త్య మమర్త్యమై మహి నింపి వెలయఁ
గృతులఁ గీర్తింతు వ్రాయింతుఁ జిత్రముల
సురగేయ మైనయాశుభవిగ్రహంబు.

చేసినకొలఁదిని జింతించుకొలఁదిఁ
దెలియ కెద్దియొ వింత వెలితియే తోఁపఁ
దీవ్రదీక్ష వహించి దేనినో వెదుకఁ
దలఁచి, నన్నుండి నేఁ దప్పించుకొనఁగఁ
దలఁచియు, నేతులేతనగావధిగను,
దీర్ఘయాత్రల కెల్లఁ దిరిగివేసరుదు.
స్వీయాన్య మత తత్వ సిద్ధాంతములను
బదిపది గాలింతు భవమూల మరయ.
తఱచియుఁ దఱచియు ధన్యుఁగాన్నైతి
తఱచిన కొలఁదిని దత్వంబు వాఁగె.
చదువు ము న్నొడవనిసంశయంబులెకె!
చదువు సత్యముఁ జుట్టు జవనికం దెఱచ్చి
కడ లేనియొకమహాగహనంబుఁ జూపి!
చదివి నేర్చిన రహస్యము విస్మృ చెప్పుదు:—
చదు వతీంద్రియపిపాసకు సాగరంబె
చదువ నప్పటిచిత్త శాంతియే శాంతి!

---

## 8

చదివితి నన్ని శాస్త్రము లన్ని శ్రుతులు,
తిరిగితి నిలఁ గల దేశంబు లెల్ల,
పటు తరసుఖదుఃఖపారము ల్గంటి,

నెఱుపవేఁడులు మంటి నప్రమత్తముగ
ఏఁ శోకపదిగాఁగ నెఱిఁగితిఁ జగము—
ఎందుఁ జూచినయేని యెక్కాలమందు
నతిపరాధీనత నగు దుఃఖ మెల్ల—
అనుచితవిశ్వాస మన్నింటఁ జెఱుపు.
మునగచెట్టు రసాలములఁ బండు నంచు,
విరిదండ గీతముల్ వినిపించుననుచుఁ
దెలియక నెఱనమ్మి తెలిసి చేడ్పడకు!
తెలియుము సర్వంబు—తెలివి తేజంబు—
తెలిసి భ్రాంతుల దిద్దు, దిద్ది మేలొందు.
నరునైనఁ బ్రకృతి నైనను దేవు నైనఁ
జక్కనారెముఁ జూచి పరితూఁచినమ్ము.
మితిమీఱు కెందేని మితిమీఱి నమ్మ
వలసిన దాత్మైక వశ మైన బలమె.
తను మించి యన్యసాధన మెందులేదు
పరమాత్మ మెప్పింపఁ బ్రకృతి సాధింప.
ప్రకృతి గీటడఁగించు బలము తప్పెఱచి
ప్రకృతికి పీఁచిచ్చి భగవంతు నణఁకు.
ఇహ మేలుఁ బ్రకృతి—వాఁ డిహముం బరంబు;
నీవును నేను రెంటెని గెల్వఁగలము—
శీలమున నిహంబుఁ జిరభక్తిఁ బరము.
మనశక్తి దైవాంశ మని గుర్తెఱుంగు

పరసుఖమున సుఖపడ నేర్తు వెంత
యంతయుఁ గూడి నీవంతు పెంపారు.

